## ఇందలి పాత్రములు :

1. అంజయ్య : జాతీయతావాది (వయస్సు: 50 సం.)
2. రాధ : అంజయ్యకూతురు (వయస్సు: 18 సం.)
3. రామం : అంజయ్య కుమారుడు (వయస్సు: 16 సం.)

భద్రయ్య : మురళీధర్, చక్రధరుల తండ్రి,
(అప్రత్యక్ష పాత్ర)

4. మురళీధర్ : భద్రయ్య పెద్దభార్య కుమారుడు
(వయస్సు: 21 సం.)
5. చక్రధర్ : భద్రయ్య రెండవభార్య కుమారుడు
(వయస్సు, 19 సం.)
6. సారథి : గ్రామంలో రైతు. (వయస్సు, 45 సం.
అంజయ్యకు వరుసకు తమ్ముడు)
7. సత్యం : పంచాయతీబోర్డు అధ్యక్షుడు.
(వయస్సు 40 సం. అంజయ్యకు అనుయాయి.)



## ఆకృతి : దుస్తులు

అంజయ్య: కోరాఖద్దరు పంచ, లాల్చీ, కళ్ళజోడు, కొంకి చేతికట్టి, పట్టీకండువా, ప్రసన్నమైన ముఖం. విశాలమైన నుదురు, కళ్ళు.

శాధ : ఖద్దరుచీర, రవిక, విశాలమైన కళ్లూ నుదురూ. మంచి రూపం, చురుకుతనం కొట్టవచ్చే ముఖం.

రామం : ఖద్దరులాగూ, సగంచేతుల చొక్కా, కొంటె చూపులూ.

మురళి : కోరాఖద్దరు పంచ, లాల్చీ, చిఱునవ్వు నవ్వే ముఖం, మంచి రూపం.

చక్రధర్ : విదేశీ లాగూ, బుష్‌కోటు, చూపరి చలాకీ తనం.

సత్యం : చలువ ఖద్దరుపంచ, లాల్చీ, కళ్లజోడు, ఖద్దరు టోపీ, వల్లెవాటు వేసిన తెల్లశాలువా.

సారధి : చేనేతపంచ, ఖద్దరుబనీను, గోరంచు మడత కండువా, కిఱ్ఱుచెప్పులు, దుక్కికఱ్ఱ.

---

# తొలిపలుకు

ఈ రూపకం నేటి సామాజికుల అభిరుచుల కను గుణంగా రూపొందించబడింది. ఇందులో ఆరు అంకాలు ఉన్నై. ఒక్కొక్క అంకం ఒక్కొక్క రంగం. మాటి మాటికీ తెర ఎత్తడం దింపడంవల్ల కాలహరణం ఇందులో పరిహరింపబడింది.

దృశ్యాల ననుసరించి తెరలు మార్చుకోవలసిన అవ సరంకూడా ఇందులో ఉత్పన్నం కాదు. కారణ మేమంటే నాటకం యావత్తూ అంజయ్యగారి యింట్లోనే జరిగింది. కాబట్టి రంగస్థలం ఒక్కటే. ముందు తెర ఎత్తడంగాని, ప్రక్కకు లాగడంగాని ఏర్పాటుచేస్తే సరిపోతుంది. కాని వెనుక తెరలో ఒకదర్వాజా ఏర్పాటు చేసుకోవాలి. అప్పుడు ఇల్లు లోపలినుండి హాలులోకీ హాలులోనుండి లోపలకూ పాత్రప్రవేశ నిష్క్రమణాలకు అవకాశం ఉంటుంది. ప్రక్క తెరలలోనుండి పాత్రములు రావడం పోవడం ఎల్లాగూ జరుగుతుంది. కాగా ఒక ముందు తెర ఒక వెనుక తెరతో నాటకం సమాప్తి చేసుకోవచ్చు నన్నమాట.

పాత్రలు నాటకంలో ఎక్కువగా అవసరమయే సన్ని వేశాలు పరిహరింపబడి, నాటకమంతా ఆఱుగురు పురుష పాత్రలతో, ఒక పరోక్షపాత్రతో సరిపుచ్చబడింది. ఇందువల్ల ఆర్థికమైన ఇబ్బందులు నాటకసమాజానికి చాలాభాగం తగ్గి పోతాయి.

అదేవిధంగా స్త్రీ పాత్ర విషయంకూడా జాగ్రత్తగా యోచింపబడింది. ఒక్కపాత్రయే ఇందు ప్రయుక్తం.

రాజకీయనాయకుల పేర్లుగాని పక్షాలపేరులు కాని బుద్ధిపూర్వకంగా ఇందు పరిహరింపబడినై. సర్వజనామోద కరమైన విషయాలకే ప్రాధాన్యం ఇచ్చి జాతి పునరుజ్జీవ నానికి ఉపష్టంభకం కాగలవాటినే స్వీకరించడం జరిగింది.

దేశాభివృద్ధి కార్యక్రమాలను గురించి ప్రణాళికను గురించి ప్రస్తావించవలసినప్పుడు, పంచాయతీ సమితులను గురించి ప్రస్తావించవలసినప్పుడు ప్రభుత్వం విషయం తప్పని సరిగా చెప్పవలసిన అవసరం ఏర్పడింది. అందుకనే "గణ తంత్రపు రాజ్యంలో ఏ జనపక్షం పరిపాలిస్తే మనకేమి? మనదొక పక్షం జనసౌకర్యమ్మే లక్ష్యం" అని పౌరుడి బాధ్యతను స్పష్టంచేయవలసి వచ్చింది.

భారతదేశంలో పట్టణాలసంఖ్యకంటె గ్రామాలసంఖ్య హెచ్చు కనుక గ్రామ పునర్నిర్మాణమే ఇందు లక్షింప బడింది. జాతీయతా స్వరూపం వివరించ బడింది.

ఈ గ్రామ పునర్నిర్మాణ సందర్భంలో అనేక సమా జాభివృద్ధికరమైన విషయా లిందులో ప్రస్తావితములయినై. ఖద్దరు, చేనేత, కుటీర పరిశ్రమలను ప్రోత్సహించడం, వ్యావ సాయంలో సహకారం, సహకారోద్యమం, పంచాయతీ ఉద్యమం, ఎన్నికలు, భారతరాజ్యాంగ విధాన పరిజ్ఞానం, కట్నాలు, పొదుపు, శాంతి, సత్యం, అహింస మొదలైన సిద్ధాంతాలు, రేడియో ... ఇంకా ఎన్నో.

ఇవన్నీ ఆనుషంగికంగా వచ్చినా అసలు ఇది ఒక సాంఘికనాటకం. నాటకం రాధ మురళిని స్మరించడంతో ప్రారంభమై మురళిని వివాహం ఆడటంతో పరిసమాప్తి చెందుతుంది. కట్నాలులేని ప్రేమవివాహమే అయినా పెద్ద వాళ్లు అంగీకరించి చేసిన వివాహం.

రాధకు మురళికి కలిగిన ప్రేమభావం కేవలం వయస్సంబంధికాదు. భావ సాజాత్యం పరిణతి పొందడంవల్ల పర్యవసించిరి. ఇద్దరూ తల్లిలేనిబిడ్డలు. ఒకరియం పొకరికి జాలి ఉండడమేకాక, ఒక కాడిని పూన్చిన రెండెడ్లవలె తమ సంసారశకటంతోపాటు, గ్రామ సంసారరథంకూడా లాగాలనే ఉత్సాహం కలవారు. భద్రయ్యకూ అంజయ్యకూ సిద్ధాంతాలలో చుక్కెదురే అయినా కూడా తప్పనిసరిగా వియ్యంకులయి కూర్చున్నారు.

సారధికి అక్షరమ్ముక్క రాకపోయినా అఖండ ప్రజ్ఞానిధి. అనుభవాన్ని కాచి వడపోసినవాడు. అధర్మాన్ని సహించనివాడు. గ్రామంలో అతడొక క్రియాశక్తి. కర్మక్షేత్రంలో అతనిబుద్ధి పారదం.

ప్రెశిడెంటు సత్యం పువ్వులాంటి మనిషి. గ్రామం కోసం అనేకవిధాలుగా పాటుపడ్డాడు. అవతలి పక్షంవారు అధర్మంగా ప్రవర్తిస్తూఉన్నా, ఎన్నికలలో తాను అధర్మం ఆచరించలేదు. (తన ప్రెశిడెంటు గిరీఅయినా వదలుకుంటాడు కాని) పదవీకాంక్ష లేనివాడు, స్వచ్ఛమైన అద్దం.

అంజయ్యకు రాజకీయచరిత్ర కావలసినంత ఉంది. ప్రతి పుటలోనూ త్యాగమే. పదవులవంక పోడు. తన ఆద

ర్శాల ప్రకారం తన సంతానాన్ని, దేశానికి పునాదిఅయిన గ్రామాన్ని, దిద్దాలనుకుంటాడు. ఎప్పుడూ ఉన్నతమైన చూపే. చిల్లరవిషయాలు గమనించడు. సజాతీయమైన సిద్ధాంతాలు కలవారంటే అధికాసక్తి.

మురళి, చదువుకున్నా పెద్ద ఉద్యోగాలు చేయాలనే అభిప్రాయం కలవాడుకాదు. తండ్రి అధర్మంచేస్తున్నా, తన కపకారం చేస్తున్నా, తెలిసి ఎదిరించలేడు. అంత ఎందుకు? తనకు రాధమీాదకల ప్రేమను ఒంటరిగా చిక్కినప్పుడు రాధతోకూడా గట్టిగా వెలువరించలేడు. అతనికి కాలం కలిసివచ్చి ఉపకారం జరగవలసిందే. ఉదాత్తమైన ప్రకృతి కలవాడు.

రాధ కొంతకాలం బస్తీలో చదువుకోవడంవల్ల తనతో చొరవగా మాట్లాడే చక్రంతో తానుకూడా చొరవగా మాట్లాడే అభ్యాసంకలది-అంతే. పల్లెటూారి పద్ధతులు, తండ్రి జాతీయతాభావాలూ పుణికి పుచ్చుకున్న ఓరిమిా, వివేకం గల పిల్ల.

చక్రం విచిత్రమైన మనిషి. కాని చెడ్డవాడుకాదు. తండ్రి అడుగుజాడల్లో నడిచినా, తాను ప్రేమించిన రాధ విషయం వచ్చేటప్పటికి తండ్రిని ఎదిరించి గట్టు తగాదా సరిచేస్తాడు. ఒంటరిగా రాధతో పెళ్లిప్రస్తావన చొరవగా చేయగలడు. సారధి మందలిస్తే మానుకోనూగలడు. మేనమామకూతురును పెండ్లి చేసుకోవడానికి నిశ్చయించుకుని, ఏమిా ఎరగనట్టూ జరగనట్టూ వచ్చి, రాధా మురళుల వివా

హాన్ని అభినందించగలడు. విదేశీపద్ధతులయందు కొంత వ్యామోహం ఉన్నవాడు.

రామం సంగతి చెప్పాలంటే మహాకొంటె. ఆ కొంటెతనం తన అక్కదగ్గరే ఎక్కువ ప్రయోగిస్తాడు. పౌరుషం గలవాడు. సీమటపాకాయమల్లే భద్రయ్య పేరుచెబితే పేలిపోతాడు. ఇంగ్లీషుతోపాటు తెలుగు ప్రబంధాలుకూడా చదివినవాడు. మురళి అంటే మురుస్తాడు. చక్రంఅంటే చిటపట లాడుతాడు. పెద్దవాళ్ళ సంభాషణలు అందుకుంటాడు.

ఇందులో పద్యాలసలు లేవు. పాటలు పరిమితంగా ఉన్నై. రాధకు, రామానికిమాత్రమే పాటలున్నై. మధురభారతి, జాతీయభారతి, విజయభారతినుండి స్వీకరింపబడిన పాటలేకాక, ఈ నాటకం నిమిత్తంకూడా కొన్ని వ్రాయబడినై.

ఇది రెండుగంటల కుద్దేశింపబడిన నాటకం. గీతాలు పెంచుకుంటే రెండుగంటలన్నరకూ, తగ్గిస్తే గంటన్నరకూ వస్తుంది.

ఒకస్త్రీని ఇద్దరు ప్రేమించడంవల్ల అసూయచే జరిగే దుర్మార్గాలకూ, ఎన్నికలలో కొట్లాటలు మొదలైన సన్నివేశాలకు తావులేకుండా కథ మలచబడింది. ఇది దృశ్యకావ్యం కావడంవల్ల శృంగారం పరిమితం చేయబడింది. విరహవేదనలూ రాయబారాలూ పరిహరింపబడినై.

ఎందరో మిత్రులు ఎంతో కాలంనుంచీ ఒక సాంఘిక నాటకం వ్రాయమని కోరుతున్నారు. అయినా ఇప్పటి వఱకూ మనస్సు దానిపై పోనేలేదు. దేశ పునర్నిర్మాణానికి జీవితం అంకితంచేయాలనే భావం ఆధారంగా వినిర్మింపబడిన ఈ నాటకానికి నిజంగా న్యాయం చేకూర్చగలవారు నటులు. ఆనందించవలసినవారు అశేషజనం.

మరినేనో–నా కర్తవ్యం నెరవేర్చాను. అంతే.

సెలవు.

— రచయిత.

# ప్రథమాంకము

(రాధ ద్వారంలోనుండి సావడిలోకి ప్రవేశిస్తూ)

ఊదరా ఒకసారి మురళి
చెలువుడా !
ఊదరా ఒకసారి మురళి

(అని పాడుకుంటూ వీధిలోనుండి అంజయ్య ప్రవేశించడం చూచి సిగ్గుతో పాట ఆపివేస్తుంది.)

అంజయ్య :- కూర్చో అమ్మా, కూర్చో.

రాధ : (ఒక కుర్చీలో కూర్చుంటుంది. అంజయ్య వేరొక కుర్చీలో కూర్చుంటాడు)

అంజ : నేను రావడంతో పాట ఆపేశావు ! మీ అమ్మ కూడా, ఇల్లాగే, కృష్ణభగవానుని మీాద పాటలు పాడు కునేది. అది పాడుతూవుంటే పక్షులాలించేవంటే, నమ్మ. చక్కని సన్నవిడి గొంతుక. (ఆగి)

అచ్చంగా నీదీ, మీ అమ్మ గొంతుకే. అదే కనుక జీవించి ఉంటే, నీకు సంగీతం చెప్పించేదాకా నిద్దుర పోనిచ్చేది కాదు.

రాధ : ఏదోలే - నాన్నా ! ఏమీాతోచక, ఏదో గొణు క్కుంటున్నాను.

అంజ : అవును. ఒంటరిగా ఉంటే ఏమితోస్తుంది నీకు ! (ఆగి) అయితే, రామం ఇంకా ఇంటికి రానేలేదా ?

రాధ : వచ్చాడు, నాన్నా, ఇందాకే వచ్చాడు - వెంటనే వెళ్లిపోయాడు. ఇవాళ పంచాయతీ ఆఫీసుదగ్గఱ, 'సాముదాయక రేడియోకేంద్రం' ఏర్పాటు చేస్తారుట! పిల్లలందరితో, గంతులేసుకుంటూ, వెళ్ళాడు. 'ఎనిమిదింటికి' గాని, ఇంటికిరానని చెప్పాడు.

అంజ : అవును. మన ప్రెశిడెంటు సత్యం, నన్ను కూడా రమ్మని చెప్పాడు. పాపం! మరీ మరీ చెప్పాడు. కట్టా చెప్పులూ ఇల్లా తే అమ్మా.

రాధ : (ఇస్తుంది)

అంజ : ఊ! కండువాకూడా

రాధ : (ఇస్తుంది)

అంజ : (ఆలోచించి) పోనీ, అమ్మా! నువ్వుకూడా బయలుదేరి రాకూడదమ్మా ... తర్వాతే వంట చేసుకోవచ్చు.

రాధ : రావడానికేంగాని నాన్నా! - (ఆగి) ఇల్లు తాళంపెట్టి రావాలి. ఇంకా దూడలనువిడవలేదు. నిన్న ఈనిన 'మాళీ గేదెకు' 'దిష్టితాడు' తీసుకురమ్మని పాలేరును గంటకిందట పంపిస్తే, ఇంకా వాడిల్లు ఈ సరికి చేరుకోలేదు. వాడూ ఆ దారినల్లో రేడియోదగ్గఱకు వెళ్ళాడో - ఏమో! (నెమ్మదిగా) అయినా - ఇక్కడికీ వినిపిస్తుంది కాదు నాన్నా! రేడియో.

అంజ : అవునమ్మా! 'లౌడ్‌స్పీకర్' కూడా పెట్టారు. తప్పకుండా వినిపిస్తుంది. అయినా - ఎంత ఊరు మనది! గచ్చకాయంత ఊరు. వినిపించకపోవడ మేమిటి?

(అంజయ్య వెళ్ళిపోతాడు. సారధి ప్రవేశిస్తాడు. రాధ కూర్చునే "ఊదరా ఒకసారి మురళీ" అనే పాటను ముక్కుతో కూనరాగంతో పాడుకుంటూ ఉంటుంది తలవంచుకుని ఆనందంతో) (సారధి ప్రవేశం)

సారధి : అమ్మాయీ, రాధా! అంజయ్యన్న ఉన్నాడా ఇంట్లో ?

రాధ : (కుర్చీలోనుండి లేచి) లేడు బాబాయి, ఇప్పుడే వెళ్ళాడు పంచాయితీ ఆఫీసుదగ్గఱకు. ఇంకా మన సందు మళుపు తిరుగుతాడో – తిరగడో...

సారధి : కాసిని మంచినీళ్ళియ్యి బుల్లీ !

రాధ : (లోపలికి వెళ్ళి తెచ్చి) ఇవిగో బాబాయి (ఇస్తుంది)

సారధి : (త్రాగి) సత్యం నన్ను పంపాడులే. అన్నయ్యను వెంటపెట్టుకుని 'రమ్మని. బుల్లెమ్మా! ప్రెశిడెంటుకు మీ నాన్నంటే ఎంత గౌరవం అనుకున్నావ్! ఒక్క అతనికే ఏమిటి – ఊళ్ళో ఎవరికైనా అంతే! సత్యాగ్రహంచేసి జైలుకు వెళ్ళాడాయె – ఎప్పుడూ 'వడుకునూలు బట్టే' కడతాడాయె. నీతీ నిజాయితీలు కల పెద్దమనిషాయె – ఎందుకుండదూ గౌరవం, అన్నయ్యంటే? కాని భద్ర య్యకు మాత్రం–

రాధ : అదేమిటి బాబాయి! ఆయనకూడా నాన్నంటే ఇష్టం గానే ఉంటాడే !

సారధి : (చప్పరించి) ఏం ఉండడంలే – బుల్లెమ్మా! ఉన్నా భద్రయ్యసంగతి వేఱు. స్వాతిశయం ఎక్కువ – ఆ మని

పికి. చెప్పొద్దూ, ధనమదం బాగాఉంది. చిన్నపిల్లవు! నీకేం తెలుసు భద్రయ్యసంగతి – మీ నాన్నకే తెలియకపోతే. (ఇంకొక గుక్క నీళ్లుత్రాగి)

మీనాన్న ముక్కుకు సూటిగాపోయే మనిషి. నల్లనివన్నీ నీళ్లూ, తెల్లనివన్నీ పాలు – ఆయనకు. చూడు, బుల్లీ? పల్లెటూళ్లు, పల్లెటూళ్లుగా ఉన్నయ్యా ఇప్పుడు! (ముక్కుమీద వేలు వేసుకుని) ఎంత చెడిపోయినై – ఎంత చెడిపోయినై! ప్రతివాడూ చెప్పేదొకటీ చేసేదొకటి! 'ఇదేమిటిరా – నీ మొహం తగలెయ్యా' అంటే 'పోలిసీ' అంటాడు. పోలిసీట పోలిసీ. త్రికరణశుద్ధిగల మనిషే లేడామె! (ఆగి, మఱచిపోయిన ముఖంపెట్టి) అయితే – అమ్మా! ఏమిటీ – చెబుతున్నాను?

రాధ : భద్రయ్యగారి సంగతి.

సారధి : వాడి సంగతి ఒక్కముక్కలో తేల్చుకో. నువ్వా తెలివిగల దానివి, స్కూలుపైనలు ప్యాసయ్యావుగా. మొదటిపెళ్ళాం కొడుకు 'మురళీధర్' కేమో బియ్యేతో చదువు మాన్పించేశాడు. రెండవపెళ్లాం కొడుకు చక్రధరరావుకేమో 'ఎమ్మే' చెప్పిస్తాడట! ఆ తర్వాత లండన్‌కో ఇంకా ఎక్కడికో పంపిస్తాడుట! ఆ భద్రయ్య ఆస్తి అంతా, న్యాయానికి, మొదటి పెళ్లాంది కదా–ఇల్లా చేస్తాడు, వీడు, మనిషా పాషాణమా?

రాధ : తానే చదువు మానివేయాలని అనుకున్నానన్నాడే మురళి నాతో. గ్రామంలోనే ఉండి వ్యవసాయం చేసుకుంటా నన్నాడే!

సారథి : నిండు కుండ! తండ్రిని గురించి ఒక్క మాటయినా వదులుగా వదలడు. "మామయ్యా! మన్నే వాడిదే భూమి అంటున్నారు. ఏమో - భూమిని నమ్ముకుని మనం వ్యవసాయం చేసుకుంటే మనం తినవచ్చు - ఒక ళ్ళకు పెట్టవచ్చు. అందుచేత చదువు మానేశా" నని నాతోనూ అన్నాడు.

రాధ : బాబాయ్! నీకూ వాళ్ళకూ ఏదయినా బంధుత్వం ఉందా?

సారథి : ఏమీ లేదు. పల్లెటూళ్ళల్లో వరుసలతో పిలుచుకోవడం అలవాటు. నువ్వు నన్ను "బాబాయి" అని పిలిచినట్లే మురళి "మామయ్యా" అని పిలుస్తాడు. అంతే - (ఏదో జ్ఞాపకం తెచ్చుకుంటూ) అయితే బుల్లీ! ఇప్పుడు గంట ఎంతయింది?

(మురళి ప్రవేశం)

మురళి : అంజయ్యగారూ!

సారథి : రా! మురళీ! ఆయన పంచాయతీ ఆఫీసుకు వెళ్ళాడు.

మురళి : (సారథితో) మీరింకా ఇక్కడే ఉన్నారేం?

సారథి : నేనూ అంజయ్యన్నను కలుపుకు వెడదామనే వచ్చాను. ఇంతకుముందే వెళ్ళాడని అమ్మాయి చెప్పింది. నేను ఇక బయలుదేరుదామా అని అనుకుంటూ ఉంటే ఇంతలో నువ్వూ వచ్చావు.

మురళి : అయితే వెడదాం రండి.

సారథి : బుల్లెమ్మా! నువ్వు రావా?

రాధ : వంటకు వేళయింది. పాలేరు ఇంకా ఇంటికి చేరలేదు. అయినా, ఇక్కడికికూడా వినిపిస్తుందిగా – బాబాయి !

సారథి : నిద్దర లేవగొట్టినట్టు వినిపిస్తుంది. చిన్న ఊరేగా !

(మురళి, రాధ ఆ మాటకు నవ్వుతారు)

మురళి : అందులో ఇక్కడికి మరీ 'గాలివాలు.'

రాధ : (కళ్ళల్లో నవ్వుకుంటుంది.)

సారథి : (నవ్వుతూ) నా ముసలిమాటలకు మీకు నవ్వొస్తే మీ పడుచుమాటలకు నాకు నవ్వురాదా ?

(రాధ, మురళి కొద్దిగా నవ్వుతారు)

మురళి : సారథిమామయ్యా ! టైమవుతోంది. మనం వెడదాం రండి.

(ఇద్దరూ వెళ్ళిపోతారు. రాధ లోనికివెళ్ళిపోతుంది. చక్రధరరావు ప్రవేశిస్తాడు)

చక్ర : అంజయ్యగారూ !

రాధ : (లోపలనుండి) ఎవరూ ? చక్రధరరావు ?

(అని బయటకు వస్తుంది)

చక్ర : అవును. నేనే – చక్రాన్ని. నాకు నీ క్రొత్తపిలుపు బాగుండదు రాధా ! కృత్రిమంగా ఉంటుంది. ఎరగని వాళ్లు పలకరించినట్లుగా ఉంటుంది.

రాధ : మనం స్కూలులో కలసి చదువుకునేటప్పుడు నువ్వు చిన్నపిల్లవాడివి. ఇప్పుడూ ఆ పేరుతోనే పిలిస్తే ఏం బాగుంటుంది ?

చక్ర : రాధా! చిన్నప్పుడు నాకు మొట్టికాయలు వేసే దానివి. జ్ఞాపకం ఉందా? (అని తల నిమురుకుంటాడు)

రాధ : (నవ్వుతూ) తల నిమురుకుంటున్నావు. ఆ నొప్పి ఇప్పటిదాకా ఉందా?

చక్ర : ఆ సంగతి జ్ఞాపకానికి వస్తే ఆ చెయ్యి అక్కడకు వెడుతుంది రాధా! అవి చిన్నతనపు రోజులు. ఎంతో హాయిగా గడచిపోయినై. (నిట్టూరుస్తాడు)

రాధ : ఇప్పుడుమాత్రం నీకు హాయిగా గడవక ఏముంది? బి. య్యే ప్యాసయి, ఎమ్మేకు వెడుతున్నావు. చేతినిండా డబ్బుంది.

చక్ర : నీకుమాత్రం ఏంతక్కువ! మీ నాన్నకు పదెకరాల కొండ్ర ఉంది. నువ్వూ స్కూలుఫైనలు ప్యాసయావు. (ఆగి) అయితే–రాధా! మనం ఇద్దరం మాట్లాడేటప్పుడు మధ్య అగాధం సృష్టిస్తావెందుకు?

రాధ : నేను సృష్టించినదేమీ లేదు చక్రం! పీఠభూమి నేలకు ఉన్నంత ఎగుడుదిగుడు లున్నై – మీకూ మాకూ.

చక్రం : నాకేమీ కనిపించడం లేదే!

రాద : నీకు కన్పించకపోవడానికి ఏవయినా కారణా లుండ వచ్చు. కాని ఎగుడు దిగుడు లున్నమాట నిజం.

చక్రం : నాకు కనిపించని ఎగుడు దిగుడుల గొడవ నా కెందుకులే.

రాధ : అల్లా పట్టించుకోకుండా ఉండడానికి వీలులేదు. ఎగుడు దిగుడులను చూడకుండా ప్రయాణం చేస్తే కాలు బెణుకుతుంది.

చక్రం : నీతో మాట్లాడుతూఉంటే, స్వర్గంలో విహరిస్తూ ఉన్నట్లుగా ఉంటుంది రాధా !

రాధ : వాస్తవిక జగత్తుకు దిగి మాట్లాడడం మంచిది చక్రం !

చక్రం : నేను దిగలేను దిగలేను రాధా! నా మనస్సు రెక్కలు విప్పి ఎగిరిపోతోంది. నీకు కూడా అల్లా అనిపించడం లేదా రాధా ?

రాధ : నాకేమని అనిపిస్తోందో తెలుసా ?

చక్రం : (ఆసక్తితో) ఏమని అనిపిస్తోంది రాధా ?

రాధ : అల్లా మనస్సు ఎగిరిపోయే మనిషిని, చంద్రమండలంలోకి 'లైకా'ను విసరి వేసినట్లు, విసరి వేయాలనిపిస్తోంది.

చక్రం : (ఆనందంతో) అచ్ఛా! అచ్ఛా! (ఆలోచించి) అదేమిటి రాధా! 'లైకా' మళ్లీ తిరిగి రాలేదే! నువ్వు రోజూ పేపరు చదవడం నా ప్రాణంమీదికి వచ్చింది. అది ఏం ఉపమానం రాధా ? అయినా ఆడవాళ్లకు 'అంత' ప్రపంచజ్ఞానం పనికిరాదు.

రాధ : ఇది గోళాంతరజ్ఞానం చక్రం! అయినా – చక్రం! నిన్నొకటి అడుగుతాను. నిజం చెబుతావా ?

చక్రం : ఆడదానితో అబద్ధం చెపుతానా, రాధా ?

రాధ : నాన్నగారు ఇంట్లోలేరని తెలుసుకే వచ్చావు కాదూ ?

చక్రం : ఠీక్ ! నిన్ను విదేశాలలో రాయబారిగా వేయవచ్చు.

రాధ : అంత హోదా ఎందుకులే !

చక్రం : పోనీ, మన ఊరి పంచాయతీలో కో ఆప్టు చేసుకోవచ్చు.

రాధ : అంతదాన్ని ఇంతకు వచ్చాను కదా! అందుకనే మన మనస్సుల్లో కూడా పీఠభూమి కున్నంత వ్యత్యాసం ఉన్నది చక్రం !

చక్రం : నేను ఇల్లా రావడం తప్పుచేసినట్లా రాధా ?

రాధ : నాన్నగారు లేనప్పుడు ఇంటికిరావడం తప్పు కాకపోవచ్చు. కాని లేరని తెలిసి రావడం–

చక్రం : నాకు ఇల్లాంటి తప్పులు చేయడం సరదా–రాధా ! నా జీవితమంతా ఇట్లాంటి తప్పులే – రోజు రోజూ చేస్తూ ఉంటే ఎంత బాగుంటుంది !

రాధ : (పెదవి విఱచి) నాకు సరదా ఏమిటో తెలుసా చక్రం ?

చక్రం : చెప్పు రాధా !

రాధ : (ముఖంలో భావశూన్యంగా) నీ వేలితో నీ కన్ను పొడవడం.

చక్రం : నీవంటే నా కెందుకిష్టమో తెలుసా రాధా ?

రాధ : (వెగటు చిఱునవ్వుతో) అబ్బే ! తెలియదు.

చక్రం : నువ్వు 'ఇల్లాంటి' చిలిపి పిల్లవు కనుకనే. నీవు నన్ను మాటలతో హింసిస్తూఉంటే, నీ తెలివికి నేను సంతోషిస్తూ, 'ఎంతో' ఆనందిస్తూ ఉంటాను. 'తీయనిమంట' అని కొందరంటారే – అది ఇదేనేమో! అందుచేతనే నిన్ను –

రాధ : ఊ! నన్ను–

చక్రం : పెళ్ళి చేసుకోవాలని–

రాధ : 'షటప్'.

చక్రం : (తెల్లబోతాడు)

రాధ : (విచారంతో) ఇంటికి వచ్చినవాణ్ణి తొందరపడి అన్నాను చక్రం!

చక్రం : నువ్వు నన్ను అంటే తప్పులేదు. అనకపోతే తప్పు. అయినా మనం దీనికి అలవాటుపడిపోయాం. 'ఆటలో అరటిపండు' అని చిన్నతనంలో అనుకునేవాళ్ళం కాదూ?

రాధ : (తలవంచుకుని కళ్లు తేల్చి) నీది చవకబారు మనస్సు చక్రం! మనకున్నదల్లా చిన్నతనంలో ఒకక్లాసు చదువుకున్న పరిచయం మాత్రమే. పై క్లాసులన్నీ నీవు పట్నం వెళ్ళి నాగరక వాతావరణంలో చదువుకున్నవే. నా వయస్సు పద్ధెనిమిది, నీ వయస్సు పందొమ్మిది. మురళితో ఉన్నంత పరిచయంకూడా నీతో నాకు లేదు. అయినా ఇందాకటినుంచీ చొరవగా పెళ్ళిసంగతి ఎంతో తేలికగా మాట్లాడేస్తున్నావ్. నేను నీ భాషలో ఎన్నిరకాలుగా సమాధానాలు చెప్పినా పట్టించుకోకుండా ధులిపేస్తు

నాన్నవు. నీ మొగాస్తరుగా నేను పెళ్ళిసంగతి మాట్లాడతా
నని ఎట్లా అనుకుంటావు చక్రం ?

చక్రం : అవును. అర్థమయింది.

రాధ : ఏమని ?

చక్రం : నువ్వు ఆడదానివని-

రాధ : ఇంతేనా ?

చక్రం : అందుచేత పెళ్ళిసంగతి మాట్లాడలేవనీ-

రాధ : ఎల్లా అర్థమయింది ?

చక్రం : ఎక్కడో చదివాలే-ఆడవాళ్ళకు సిగ్గు ఉంటుందని.

రాధ : చదవడ మేమిటి? పట్నంలో ఆడవాళ్ళను చూడలా?

చక్రం : నాతో చదువుకున్నవాళ్ళ నెఱుగుదును. వాళ్ళ
కసలు సిగ్గులేదు.

రాధ : నేనూ చదివా.

చక్రం : ఏమనీ ?

రాధ : మొగవాళ్ళకు సిగ్గూ భిడియం ఉండవని.

చక్రం : చంపేశావు. (ఆగి) నాకు లేకపోయినా ఫర్వాలేదు.

రాధ : ఎందుచేత ?

చక్రం : నీ దగ్గఱ ఉన్నాయిగా.

రాధ : చంపేశావు.

చక్రం : అదేమిటి ?

రాధ : పెళ్ళిబేరం చావుదాకా వచ్చింది (నవ్వుతుంది.)

చక్రం : మళ్ళీ మనమిద్దరం కలిసి దాన్ని బతికిద్దాం.

రాధ : చస్తే బ్రతకదు. పోనీ ప్రైచేయి.

చక్రం : ఆ పని చేస్తూనే ఉన్నా రాధా !
రాధ : ఎంతవరకొచ్చావ్ ?
చక్రం : మీ యింటిదాకా
రాధ : ఇంకా
చక్రం : నిన్ను ధైర్యంచేసి అడిగేదాకా
రాధ : మరి మీ నాన్నను అడిగావా ?
చక్రం : (తెల్లబోయి) అమ్మో ! మా నాన్ననే ! ఎదురు పడి అడగడమే, యముడు. (ఆగి) అయినా అడగడం ఎందుకు ? మగవాళ్ళకు ప్రేమించే స్వాతంత్ర్యం ఉంది.
రాధ : లేనిది ఆడవాళ్ళకని తెలుసుగా
చక్రం : అబ్బెబ్బే ! వాళ్ళకీ ఉంది సమానహక్కు.
రాధ : ఇంత తూకంలేని మనిషివేం చక్రం ? తూకం లేక పోతే బండీ బోల్తా కొడుతుంది.
చక్రం : నన్ను చంపక, నీ కిష్టం లేకపోతే స్పష్టంగా చెప్పి వేయి రాధా !
రాధ : చక్రం ! 'పెళ్ళి' అనేది జీవితానికి సంబంధించిన విషయం. ఆషామాషీ సంభాషణల్లో తేలేది కాదు. ఎన్నో విషయాలు ఆలోచించవలసి ఉంటుంది. దైనిక పత్రికలు చదవడంవల్లవచ్చే లోకజ్ఞానం దానికి సరిపోదు. వయస్సు పరిపాకం అనేది అనుభవాలను వడబోస్తుంది. మా నాన్న పెద్దవాడు. ఆయన మాటయందు నాకు లక్ష్యం. ఇంకా నా పెళ్లినిగురించి నాకేమీ ఒక అభిప్రాయమంటూ ఏర్పడలేదని నేను చెబితే నీవు నమ్మాలి చక్రం !

చక్రం : (నిశ్చేష్టుడై) ఏమిటీ ! అంతేనా ?

రాధ : నిజం. చక్రం !

చక్ర : మురళితో కూడా నువ్వు చనువుగా ఉంటుంటే—

రాధ : అదేమిటి చక్రం ! మురళి మీ అన్నయ్య కదా ! నాకంటె మూడుక్లాసులు పైన చదివేవాడు, మూడేళ్లు పెద్దవాడు: మీకుటుంబానికీ మాకుటుంబానికీ రాకపోక లున్నవి. కనుక పరిచయంకొద్దీ మాట్లాడుతాం. దానిని ఎవరైనా అపార్థం చేసుకుంటే మానేస్తాం – అంతే.

చక్రం : మురళికంటె ముందుగా నా అర్జీ దాఖలు చేసుకుంటే మంచిదని దాఖలు చేసుకున్నాను రాధా !

రాధ : మంచి సమయం చూచి దాఖలు చేసుకున్నావ్.

చక్రం : ఏం.

రాధ : అసుర సంధ్యవేళ.

చక్రం : కోర్టువారికి టైము అయిపోయిందా ?

రాధ : జడ్జీగారు న్యాయపక్షపాతి. అకాలంలో దాఖలు చేసిన అర్జీలకు కూడా నంబరు వేస్తారుకాని –

చక్రం : మళ్లీ కానీ, అర్ధణా అంటున్నావు రాధా.

రాధ : తర్వాత న్యాయం ఆలోచించి చేస్తారు. ఇకమీరు వెళ్లవచ్చు.

చక్రం : విచారణకు ఎప్పటికి వస్తుంది.

రాధ : మూడేళ్లు పట్టదులే.

చక్రం : ఈ పిటీషన్ ఎడ్వాన్సు చేయవలసిందిగా ఇంకొక్క ఔట్ ఆఫ్ ఆర్డరు పిటీషన్ పెట్టుకుంటాను.

రాధ : పార్టీ కోర్టు ప్రిజడిన్ కాకుండా చూచుకోవాలి.

చక్రం : వెళ్లివస్తా. రాధా ! షేక్ హాండ్ ఇస్తావా. (అని సాభిప్రాయంగా చూస్తాడు.)

రాధ : (స్థైర్యంతో చేతులు జోడించి) నమస్తే.

(చక్రం వెళ్లిపోతాడు. రాధ లోనికి వెళ్ళిపోతుంది, అంజయ్య ప్రవేశిస్తాడు.)

అంజ : వంట అయిందా అమ్మా ?

రాధ : (లోపలనుండి వచ్చి) అయిపోయినట్టే నాన్నా.

అంజ : ఆలస్యం అయిందేం తల్లీ ! రేడియో వింటూ కూర్చున్నావా? అసలు మన ఇంటికి బాగా వినపడిందా?

రాధ : వినపడింది నాన్నా. కాని నేను వినడం పడలేదు.

అంజ : అదేమమ్మా ?

రాధ : విందామనుకుంటే, మనింటికి కింకొక రేడియోసెట్టు వచ్చి కూర్చుంది. దాంతో ప్రొద్దుపోయింది.

అంజ : ఓహో ! క్లాసుమేటు చక్రం వచ్చాడా ఏమిటి ? వస్తే వాడికి ప్రొద్దు తెలియదు. 'వట్టి సోదిరాముడు.'

రాధ : ఇంటికి వచ్చిన మనిషిని మాటల్లో త్రుంచేసి లోపలకు వెళ్లలేకపోయాను నాన్నా ! ఎమ్మే చదువుతాడుట కాదు నాన్నా ?

అంజ : ఎంత చదువైనా చెప్పిస్తాడు భద్రయ్య, వాడికి. వాడిమీాద ఇఱువై వేల కట్నం తీసుకోవాలని ఉంటే చెప్పించడూ ?

రాధ : బిల్లుఉందికాదు నాన్నా కట్నం తీసుకోకూడదని.

అంజ : బిల్లులన్నీ లేదా 'ఆక్టు'లన్నీ ప్రజాప్రతినిధుల అభిప్రాయాన్నే వ్యక్తపరుస్తై. లేదా దానికి భిన్నంగా నడిచే వాళ్ళను శిక్షిస్తై. కాని అసలు పరివర్తనం ప్రజలలో రావాలి తల్లీ !



రాధ : మురళి చదువు ఆపేశాడేం నాన్నా ?

అంజ : భద్రయ్యకు చెప్పించాలనీ లేదు. మురళికి చదువుకోవాలనీ లేదు. మురళి మన ప్రెశిడెంటు సత్యంతో పాటు జాతీయ భావాలు కలవాడు. బుద్ధిమంతుడు. చుట్ట బీడీ సిగరెట్ కాల్చడు. ఖద్దరే కడతాడు. పరోపకార బుద్ధి ఉన్నవాడు. మన పద్ధతిలో మనిషి.

రాధ : నీకు రామం కలవలేదా నాన్నా ?

అంజ : కలవలేదమ్మా. ప్రెశిడెంటు రేడియోకి ప్రారంభోత్సవం నాచేత చేయించాడు. నేనూ, సారథీ, సత్యం, మురళీ అక్కడే ఉన్నాం, ఇప్పటిదాకా ఏవో కబుర్లు చెప్పుకుంటూ. వీడు ఇంటికి వచ్చేశాడనుకున్నా. మఱచి పోయాను, పాలేరు వచ్చాడా ?



రాధ : వచ్చాడు నాన్నా.

(రామం ప్రవేశం)

రాధ : అదుగో ! రామంకూడా వచ్చేశాడు నాన్నా. స్నానం చేయండి భోజనం చేతురుగాని.

(రాధ లోపలకు వెళ్లిపోతుంది)

అంజ : ఏం రా ! ఇంత ఆలస్యం అయిందేం

రామం : (భయపడుతూ) అయింది నాన్నా ! సావాసకాళ్లు రానీయలేదు.

అంజ : పోనీ ! ఇప్పటికయినా రానిచ్చారు. ఇంటిదగ్గఱ అక్కయ్య ఒక్కర్తే ఉంటుంది కదా-సహాయం చెయ్యడానికి ఉండాలని తోచనక్కర్లా ?

రామం : (తల గోక్కుంటాడు)

రాధ : (లోపలనుండి వచ్చి) నీళ్లు తోడాను నాన్నా.

అంజ : వస్తున్నానమ్మా.

(రాధ లోపలకు వెడుతుంది. తర్వాత అంజయ్య, తర్వాత రామం లోపలకు వెడుతుండగా ముందు తెరపడుతుంది.)



# ద్వితీయాంకము

(రాధ కూర్చుని ఏదో పుస్తకం చదువుతూ ఉండగా సారథి ప్రవేశం)

సారథి : అంజయ్యన్న ఉన్నాడా అమ్మాయి !

రాధ : (లేచి పుస్తకం మూసివేసి) ఇప్పుడే వీధిలోకి వెళ్లాడు బాబాయి. ఎవరయినా వస్తే కూర్చోమని చెప్పమన్నాడు. ఇప్పుడే తిరిగి వస్తానన్నాడు.

(సారథి ఒక కుర్చీలో కూర్చుంటాడు. తర్వాత రాధ కూర్చుంటుంది.)

రాధ : రాత్రి రేడియోలో ఏం చెప్పారు బాబాయి ?

సారథి : నువ్వు వినలా ?

రాధ : వినడానికి వీలు చిక్కలేదు బాబాయి. ఇకనుంచి రోజూ వినబడుతూనే ఉంటుందిగా సాయంత్రపూట.

సారథి : చెప్పినవి తెలుస్తాయి కాని ఒడుపుగా తిప్పి చెప్పడం తెలియదమ్మాయి.

రాధ : పోనీ ! ఎల్లాగో అల్లా చెప్పు. చెపుతూఉంటే నువ్వే చెప్పడంలో రాటు తేలుతావు.

సారథి : ఎవరో ఉపన్యాసం చెప్పారమ్మాయి. మన భారత ప్రభుత్వం స్వరాజ్యం వచ్చిన తర్వాత చాలా సౌకర్యాలు చేసిందని చెప్పారు.

రాధ : ఏమేమి చేశారని చెప్పారేమిటి ?

సారధి : పంజాబ్‌లో భ్రాకానంగాల్ ఆనకట్ట కట్టారుట. ఒరిస్సాలో హిరాకుడ్ డాం కట్టారుట. ఆంధ్రప్రదేశ్‌లో తుంగభద్ర డాం కట్టారుట, నాగార్జునసాగర్ కట్టుతున్నారట, వాటికి కుడి ఎడమ కాలువలు త్రవ్వుతారుట, బీహార్ నేపాల్ మధ్య కోసీప్రాజెక్టు కట్టారుట.

రాధ : ఇవన్నీ నీకు ఎల్లా జ్ఞాపకం ఉన్నాయి బాబాయి ?

సారధి : మధ్యలో నన్నాపకబోకు. ఇంకా చెబుతా. బెంగాల్‌లో మయూరాక్షి ప్రోజెక్టు కట్టారుట. మద్రాసులో లోయర్ భవాని డాం, బీహార్‌లో దామోదరవాలీ కట్టారుట, ఇంకా–దేవుడు మేలుచేస్తే– ఆహాండ్ ప్రోజెక్టుట, కోయిన ప్రోజెక్టుట, మాచ్‌ఖండ్ హైడ్రో ఎలెక్ట్రిక్ స్కీముట, కృష్ణాబారేజి నిర్మాణంట – ఎన్నెన్నో చెప్పాడు.

రాధ : రోజూ పేపరు చదివేవాళ్ళం – మాకే జ్ఞాపకం ఉండవుకదా ఇవి – నీ కెల్లా జ్ఞాపకం ఉన్నాయి బాబాయి ?

సారథి : మీ పిన్ని ప్యాసయింది ఆఋ క్లాసులైనా, పేపరు ఝుణఝుణా చదివేస్తుంది. నేను చదివించుకుని రోజూ వింటాను. అందుచేత ఇవన్నీ రేడియోలో వచ్చేసరికి, ఏక టాకీని చెప్పగలిగాను. ఇంకా చెబుతా బుల్లెమ్మా !

రాధ : చెప్పు. చెప్పు. ఇంకా నాన్న రాలేదుగా. ఊరికే కూర్చుని ఏం చేస్తాం ?

సారధి : ఆసియాలోకల్లా పెద్దదిట సింద్రీ ఎఱువుల ఫాక్టరీ, దానిని కట్టారుట.

రాధ : ఊఁ

సారధి : భిలాయి, రూర్కేలా, దుర్గాపూర్‌లలో ఉక్కు కర్మాగారాలు కట్టారుట.

రాధ : ఇంకా

సారధి : బెంగుళూరులో హిందూస్థాన్ ఎయిర్‌క్రాఫ్టు టెలిఫోను ఫాక్టరీలు కట్టారుట.

రాధ : ఇంగ్లీషు మాటలుకూడా బాగానే ఉచ్చరిస్తున్నావు బాబాయి.

సార : అలవాటు అయితే సరి. రోడ్డూ, టిఫిను, ఇల్లాంటి వన్నీ అలవాటయిపోలా, అల్లాగే.

విశాఖలో నౌకా నిర్మాణం, ఇంకా కొచ్చిన్‌లో ఓడరేవును అభివృద్ధి చేస్తున్నారట. పెరంబూరులో రైలుపెట్టెల ఫాక్టరీ కట్టారుట పశ్చిమ బెంగాల్‌లో 'చిత్తరంజన్' రైలు ఇంజనుల ఫాక్టరీ కట్టారుట. కొన్ని వేల గ్రామాలకు కరెంటు ఇచ్చారుట. అనేక ప్రాంతీయ రేడియో కేంద్రాలు స్థాపించారుట.

అయితే - బుల్లెమ్మా! రేడియోలో అబద్ధాలు చెబుతారా?

రాధ : చెప్పరు బాబాయి.

సారధి : సరి.

రాధ : సరిఏమిటి బాబాయి?

సారథి : ఆఁ! నేనూ అంతే అనుకున్నాను బుల్లెమ్మా. ఇద్దరి ఊహా సరిపోయిందని 'సరి' అన్నాను.

(అంజయ్య ప్రవేశం)

అంజ ; సరి అనుకుంటున్నారేమిటి ?

(అంజయ్యకూడా ఒక కుర్చీలో కూర్చుంటాడు.)

రాధ : చూడు నాన్నా ! బాబాయికి ఒక సందేహం వచ్చింది – రేడియోలో చెప్పే సంగతులు నిజమైనవేనా అని. నాచేతకూడా ఋజువు పలికించుకుని 'సరి' అను కుంటున్నాడు.

సారథి : అయితే – అంజయ్యన్నా ! ప్రభుత్వం మాటి మాటికీ అదిచేస్తోంది. ఇదిచేస్తోంది. అని ఎందుకు చెప్పడం ? చేసిందేమో చేసి మెదలకుండా ఊరుకో కూడదూ ?

అంజ : (నవ్వి) మనది గణతంత్ర రాజ్యం. అయిదేళ్లు అధి కారంలో ఉండి ప్రజలకు సౌకర్యం కలిగించే నిమిత్తం ప్రాంతానికి సంబంధించిన శాసనసభ్యులను, దేశానికి సంబంధించిన పార్లమెంటు సభ్యులను ప్రజలు ఎన్నుకుం టారు. మెజారిటీ పక్షంవారు ప్రభుత్వం ఏర్పాటుచేస్తారు. మైనారిటీ పక్షంవారు ప్రభుత్వం చేసే లోపాలను విమ ర్శించే ప్రతిపక్షం అవుతారు. ప్రభుత్వపక్షం, ప్రతిపక్షం విమర్శలకు సమాధానం చెప్పవలసి ఉంటుంది.

సారథి : నేను రేడియో సంగతి అడిగితే నువ్వు ఏదో గొడవ లోకి లాగుతున్నావేం అన్నా ! అయినా చెప్పు. వినడా నికి బాగానే ఉంది.

అంజ : ప్రభుత్వం శాసనసభలో తమ కార్యక్రమాన్ని వివరిస్తూ ప్రజలకు కూడా తెలియపరుస్తూ ఉంటుంది. మన భారతదేశంలో ఏడులక్షల గ్రామాలూ కొన్ని పట్టణాలూ ఉన్నై.

మంత్రులూ, అధికారులూ ప్రభుత్వ కార్యక్రమాలు విశదీకరించినా, మొత్తం జనాభాకంతా ఆ వార్తలు అందడం కష్టం. అందుచేత ప్రసారశాఖ ప్రభుత్వ విధానాలూ, చేసే పనులూ, విశదీకరిస్తుంది. ప్రభుత్వం ఏం చేస్తోందో ఏరోజు కారోజే మారుమూలలను ఉన్న మనకు కూడా తెలుస్తుంది.

సారధి : అల్లా చెబుతూ ఉండడం మనకుకొంత విసుగు కలిగించినా 'రైటే' అంటావు.

అంజ : నిన్న తిన్నకూర ఇవాళ మనకు జ్ఞాపకం ఉండదు కదా ! ఇంత విశాలమైన దేశంలో ఏమూల ఏంజరుగుతోందో, నిత్యం చెబుతూ ఉంటే తప్ప ఎల్లా జ్ఞాపకం ఉంటుంది ?

సారధి : 'అరటి పండొలచి చేతిలో పెట్టినట్లు' చెప్పావనా్న. ఈ 'తిరకాసు' నాకు తెలియనే తెలియదు. అయినా మనకు ఒక 'ఆంధ్రప్రదేశం'లో జరిగే పనులే చూడడానికి వీలు చిక్కకపోయె. దేశమంతటిలో జరిగే పనులు ఎల్లా చూస్తాం ? ఎన్నాళ్ళనుంచో "కృష్ణా బారేజి" – అదే, "ప్రకాశంబారేజి" చూద్దామని అనుకుంటూ. గుంటూరు, విజయవాడ దానిమూలంగా కలిసిపోయినట్లయినాయట ! దాన్నే చూడడం పడలేదు.

అంజ : అందరికీ అన్నీ చూడడం సాధ్యంకాదు సారధీ.

సారథి : వీటికేంగాని – నాకు రేడియో ఒకందుకు నచ్చింది.

రాధ : ఎందు కేమిటి ?

సార : మనం, రైతులమూ ! నా మటుకు నేను యాభై పుట్ల ధాన్యం పండిస్తున్నా కదా. విత్తనాలు చల్లడాని కేమిటి, కోతలు కోయడాని కేమిటి, ఇంకా మంచి చెడ్డల కన్నింటికీ వాతావరణం ముఖ్యం కదా.

వాన రాకపోతే, గాలి పొడిగా ఉందనీ, తుపాను వచ్చేటట్లయితే, అదేదో వాయుగుండం ఏర్పడిందనీ ముందుగా చెప్పేస్తుంది రేడియో. పంచాంగం బ్రాహ్మ డల్లే ఇల్లా మంచి చెడ్డలు చెప్పే రేడియో నాకెంతో యిష్టం. నిన్న మటుకు నిన్న దానికి దణ్ణం పెట్టాలని అనిపించిందంటే నమ్మ.

రాధ : (నవ్వుతూ) పెట్టావేమిటి బాబాయి ?

సారథి : పెట్టలేదులే – నేనేం పిచ్చివాడినా ఏమిటి? దళారులు బస్తీధరలు కమ్మా చేయకుండా ఏరోజు కారోజు ధాన్యం రేట్లు చెబుతుంది కదా రేడియో ! ఇల్లా ధరలు తెలి యడం రైతు కెంత లాభం !

(రామం ప్రవేశం)

రామం : నాన్నా ! నాన్నా ! భద్రయ్యగారి పాలేళ్లు మన చేనుగట్టు నఱుకుతున్నారు నాన్నా ! మన పాలేరు ఆగ మన్నా వాళ్లు ఆగమంటున్నారు. నిన్ను ఉన్నవాడి నున్నట్లుగా తీసుకు రమ్మన్నాడు పాలేరు.

సారథి : ఎన్ని వేళ్లొచ్చినా ఆ భద్రయ్యకు గట్లు కతకడం దుర్బుద్ధి పోదు. నూరు పుట్లు పండించే ఆసామి కదా! పెద్ద బుద్ధు లుండొద్దూ! ఒకళ్ళకు చెప్ప నేర్చినవాడే! ఈ చెయ్యాడింపు మానడే?

అంజ : తొందర బడబోకు సారథీ! ఆసాములకు తగాదా పెట్టడంకోసం ఒకప్పుడు పాలేళ్లు కూడా ఇల్లాంటి చిలిపి పనులు చేస్తూ ఉంటారు. మనం నిర్ధారణ చేసుకోందే ఒకరిమీద గుడ్డ కాల్చి పారవేయకూడదు.

సారథి : నువ్వు చూ స్తేకాని నమ్మవులే. నాకు తెలుసు భద్రయ్య సంగతి! ఒకసారి రెండేళ్ళ క్రితం ఊడ్పుల్లో నేను దారివెంబడి వెడుతూఉంటే పాలేళ్ళను కూర్చోబెట్టుకు పాఠం చెబుతున్నాడు భద్రయ్య. (ఆగి) 'ఏమని' అని అడగవేం?

అంజ : ఊ. ఏమని?

సారథి : నాకూ భద్రయ్యకూ, ఒకచోట కాడిగట్టు ఉందిలే. వేసవి కాలంలో తానే గట్టుతీశాడు. తొలకరించిన తర్వాత అలాగ్గా సరిచేశాడు. మళ్ళీ చేనుకు నీళ్లెట్టి బాగుచేసేటప్పుడు పారతో ఒక 'పారవరస' చిత్రిక పట్టమని చెబుతున్నాడు పాలేళ్ళతో. ఈ మాటలు 'ఆట్టే' విన్నాను. ఇక చూసుకో - వాళ్ళ దొడ్డి తలుపు దబా దబా బాదా. నన్నుచూసి భద్రయ్య తెల్లబోయాడు. పాలేళ్లూ తెల్లబోయారు. కాని వాళ్ళలోవాళ్లు ముసి ముసి నవ్వులు నవ్వుకుంటున్నారు.

రాధ : ఆ తర్వాత ఏం చేశావు బాబాయి ?

సారధి : "భద్రయ్యా! నీ మాటలు విన్నాను" అన్నా. "నేనే మన్నాను. నేనే మన్నాను" అని నత్తులు కొట్టాడు. అంతటితో ఆ వ్యవహారం సర్దుకుపోయింది. గట్టు దగ్గర కొస్తే ఒట్టు. ఎవరికి చెప్పే తీరులో వారికి చెప్పాలి.

నువ్వు 'సత్యాగ్రహి' వని తెలుసు. మెత్తనివాడు కదా అని గట్టు చిత్రిక పట్టమని పాలేళ్ళకు చెప్పి ఉంటాడు.

అంజ : 'సత్యాగ్రహి' అధర్మాన్ని సహించని వాడే సారధీ. విధానంలో మెత్తదనం ఉండవచ్చు కాని విషయంలో కఠినంగానే ఉంటాడు.

సారధి : ఏదో అన్నాలే - గట్టు అనేది తల్లిలాంటి దనీ, దానిని ముట్టుకోకూడదని జ్ఞానం లేదే - మనిషికి, ఇన్నేళ్లొచ్చి.

అంజ : వెడదాం పద, సారధీ!

సారధి : ఇదంతా భద్రయ్య ఎందుకు చేస్తున్నాడో తెలుసునా ?

అంజ : ఎందుకనీ ?

సారధి : నువ్వు ఏదో కాడికా మడిచక్కలు అమ్ముకుని తట్ట తగలేసుకుని లేచిపోతావని ఊహ. ఉత్త పొట్లచెట్టు! మనిషికి పొరుగుగిట్టదు. మహాగడుసు. (నవ్వి) త్రాచు పామంత శౌర్యం ఉందికాని మళ్లీ జెట్టిగొడ్డంత భయమూ ఉంది.

అంజ : సరే - ప్రెశిడెంటు సత్యాన్ని, మనసబు కరణాలను కూడా కలుపు వెడదాం పద.

(ఒక్కొక్కరు బయటకు వెడుతూ ఉంటారు. ఒంటరిగా విషాదంతో ఉన్న రాధ మిగిలిపోతుంది. తెరపడుతుంది)



# తృతీయాంకము

మురళి : అంజయ్యగారూ.

రాధ : (ఇంటిలోపలి నుండి) ఎవరు? (బయటకు వచ్చి) నువ్వా మురళీధర్! కూర్చో (అని కుర్చీ చూపిస్తుంది.)

మురళి : నాన్నగారు లేరా?

రాధ : (వికాసం తగ్గిన ముఖంతో) ఇప్పుడే బయటకు వెళ్ళారు.

మురళి : రామం?

రాధ : వాడూ లేడు.

మురళి : ఇద్దరూ లేరా! అయితే వెడతా రాధా!
(లేవబోతాడు)

రాధ : వస్తే ఏమని చెప్పమన్నావ్?

మురళి : ఏనేం లేదు రాధా! ఊరికేనే - మనస్సు బాగుండక కాసేపు ఇక్కడ కూర్చుని వెడదామని వచ్చాను.

రాధ : అయితే, కూర్చో. వచ్చిన వాడవు వెంటనే వెళ్ళక పోతేనేం?

మురళి : (నిరుత్సాహంగా) ఇక్కడ కూర్చున్నా - మనసు బాగుండలేదు.

రాధ : ఎందుచేత?

మురళి : ఎప్పుడూ అలవాటు లేని 'మురళీధర్' అనే పేరుతో నువ్వు పిలిచావు.

రాధ : ఎవరయినా పూర్తి పేరుతో పిలిస్తే సంతోషిస్తారే-

మురళి : క్రొత్తవాళ్ళయితే. పాతవాళ్లు అలవాటులో ఉన్న పేరు వదలితే - మనిషిని ఎంతో దూరంగా ఉండమన్న ట్లర్థం.

రాధ : (భావరహితంగా) అల్లాగా.

మురళి : కోపం వచ్చినప్పుడు మాత్రమే మా నాన్నగారు నన్ను పూర్తి పేరుతో పిలుస్తారు.

రాధ : (నిట్టూర్చి) అయితే - నిన్ను ఇకనుంచి పూర్తి పేరుతో పిలవనులే.

మురళి : అసలు పేరుతో పిలవకుండా పిలిస్తే సంతోషిస్తాను.

రాధ : అల్లాగా (కొద్దిగా నవ్వుతుంది)

మురళి : రాధా ! నువ్వు ఇవాళ అల్లా ఉన్నావేం ?

రాధ : ఎల్లా ఉన్నాను ?

మురళి : నువ్వు నవ్వినా ఇవాళ నీ ముఖంలో వికాసం లేదు.

రాధ : నువ్వు ముఖ పరీక్ష చేయడం మొదలెట్టావని తెలియదు.

మురళి : అద్దంలో కనబడినట్లు కనపడేదానికి పరీక్ష ఎందుకు?

రాధ : నిజంగా - అల్లా ఉన్నానా ?

మురళి : అక్షరాలా. ఇంకా నిజం చెప్పాలంటే ఏదో నన్ను మర్యాదకోసం కూర్చోమన్నావు కాని, నాతో ఇవాళ మాట్లాడాలనే అభిప్రాయమే లేదు నీకు.

రాధ : అల్లాగా - (కళ్లల్లోకి చూస్తూ) అయితే కవిత్వం వ్రాయవచ్చు నువ్వు.

మురళి : ఏం ? అల్లా అనేశావు ?

రాధ : నీ పరిశీలనా శక్తి బహుదొడ్డది.

మురళి : నాకు యూనివర్శిటీ వారిచ్చిన సర్టిఫికెట్ కంటె, నీ సర్టిఫికెట్ కే ఎక్కువ విలువ ఇద్దామనుకొంటున్నాను.

రాధ : ఏ సర్టిఫికెట్ కంటె ?

మురళి : బ్రహ్మచారి సర్టిఫికెట్ - బి. ఏ.

రాధ : నా సర్టిఫికెట్ విలువ నీ వరకే. పట్టభద్రుల సర్టిఫికెట్‌ను ప్రజలంతా గౌరవిస్తారు. ప్రభుత్వమూ గౌరవిస్తుంది.

మురళి : ఇంతకూ నువ్వు అల్లా ఉండడానికి కారణం చెప్పావుకావు ?

రాధ : నీకు మనస్సు బాగుండక వచ్చావనన్నావు. దానికి కారణం నే నడిగానా ?

మురళి : అల్లా నువ్వు అడక్కపోవడంచేత కూడా నా మనస్సు మరింత పాడయింది.

రాధ : (కళ్లలో నీళ్లు నింపుతూ) పెద్ద రాళ్ళ క్రింద చేతులు పెట్టకూడదు మురళీ !

(చక్రం ప్రవేశిస్తూ)

చక్రం : రాధా ! రాధా ! (మురళివంక అసూయతో చూస్తాడు)

రాధ : కూర్చో చక్రం.

చక్రం : (ఇంకొక కుర్చీలో కూర్చుంటాడు) పెద్ద రాళ్లూ, చేతులూ, అంటున్నావేమిటి రాధా ?

రాధ : ధనికుల సరిహద్దున సామాన్యులు ఉండడానికి కూడా వీలు లేదు. లేకపోతే మీ పాలేళ్ళు మా సరిహద్దు గట్టును నఱకవలసిన అవసరం ఎందుకొస్తుంది ?

చక్రం : అంజయ్యగారేరీ ?

రాధ : గట్టు దగ్గఱకే వెళ్లారు.

చక్రం : నేనూ ఇప్పుడే వెడతా రాధా! మన రెండు కుటుంబాలకూ తగాదా రానివ్వను.

(చక్రం వెళ్లిపోతాడు)

మురళి : ఈ పిచ్చిపనులు ఎందుకు చేస్తారో తెలియదు. గట్టంతా కలుపుకున్నా 'సెంటు' నేల కూడా కలవదు. దానికోసం పల్లెల్లో కుమ్ములాడుకుని కోర్టుకు పోయి వేలు కుమ్మరిస్తారు. అయితే రాధా ! నీ మనస్సులో వికాసం లేకపోవడానికి కారణం ఇదా ? రాగానే నా కెందుకు చెప్పలేదు ?

రాధ : ఇప్పుడు కూడా చక్రానికీ చెప్పదలచుకోలేదు. పెద్ద రాళ్ళక్రింద చేతులేమిటంటే చెప్పవలసి వచ్చింది.

మురళి : ఆడవాళ్ళు తెలివిగా మాట మలపగలరు. వెళ్లివస్తా రాధా ! నేనూ గట్టు దగ్గఱకే వెడతా (లేస్తాడు)

రాధ : ముందు నీతో చెప్పలేదని ఏమీ అనుకోకు మురళీ ! మా గట్టు మూలంగా మీ తండ్రీ కొడుకులకు విరోధం రావడం నాకిష్టం లేదు.

(ఒక్క క్షణం ఆగి, మురళి వెళ్లిపోతాడు. మురళి వెళ్లిన దారినే రాధ నిలబడి చూస్తూ ఉంటుంది. రామం అంజయ్య, సారధి, సత్యం ప్రవేశిస్తారు.)

రాధ : (అంజయ్యతో) ఏం జరిగింది నాన్నా ?

సారధి : చక్రం వచ్చి పాలేళ్లను చివాట్లు పెట్టేదాకా ఘర్షణ జరుగుతూనే ఉంది మన పాలేరుకూ వాళ్ల పాలేళ్లకూ. ప్రెశిడెంటు సత్యం ఎన్నిసార్లు కబురుచేసినా భద్రయ్యా ప్రదేశం మీాదికి రానేలేదు. 'ఈ సత్యం కబురు చేసే వాడూ నేను వచ్చేవాడిసీనా' అని భద్రయ్యకు తల దిమ్మ.

అంజ : అదేమిటి సారధీ! అతనికి తీరుబడిలేక రాలేదేమో!

సారధి : ఊరుకో, అంజయ్యనాన్నా! నువ్వు సత్యకాలం మనిషివి. నేను భద్రయ్య సంగతి కాచి వడబోసినవాడిని. రేడియో ప్రారంభోత్సవానికి భద్రయ్య రాలేదు ప్రెశిడెంటు స్వయంగా వెళ్లి పిలిచినా ఎందుకు రాలేదంటావ్?

అంజ : ఏమో! అతనికేమి ఇబ్బంది వచ్చిందో!

సారధి : 'ఏమి ఇబ్బంది వచ్చిందో' కాదు. 'ఏమి రోగం వచ్చిందో' అను, అప్పుడు సరిపోతుంది. ఇదిగో—ఈ సారధి ఉన్నాడే, అక్షరమ్ముక్కలు వ్రాయలేకపోయినా ఆవలిస్తే పేగులు లెక్కపెట్టగలడు. చూశావ్ తమాషా. భద్రయ్యను పలికించా పలుకులు! ఏం పలుకులు పలికాడని చెప్పను!

సత్యం : ఏమని అన్నాడేమిటి ?

సారధి : "ఉమ్మడి రేడియో వినే ప్రారబ్ధం మాకు పట్టలేదు. రేపీపాటికి చెన్నపట్నం నుంచి ఘాచక్రం ఒక రేడియో సెట్టు కొనుక్కొస్తాను. మా యింట్లో మేమే వింటాం" అని ఈసంతా కక్కాడు.

రామం : వీధివెంబడి పోతూఉంటే, ఉమ్మడిరేడియో మోగుతూఉంటే చెవులు మూసుకుంటాడా? లేకపోతే ఆ శబ్దం వినబడకుండా చెవులకు గంటలు కట్టుకుంటాడా- ఘంటాసురుడల్లే?

అంజ : ఒరేయ్. నోరు ముయ్యరా. చిన్నా పెద్దా అక్కర్లా? అప్పుడే వ్యవహర్తవై పోయావు - పెద్దవాళ్ళ మాట లందుకొంటూ!

రామం : కడుపు మండుతోంది నాన్నా. గట్టు నఱికమని పాలేళ్ళను పంపిస్తే.

అంజ : అయినా రేడియోసెట్టు కొనడానికి చెన్నపట్నం ఎందుకు? విజయవాడలో దొరకవూ?

రామం : దగ్గర బస్తీలో కొంటే గొప్పవాళ్ళ గొప్పతనం ఏముందీ? వాళ్ళ చక్రం రోజుకు మూడుసార్లు చెన్న పట్నం చుట్టూ 'చక్కర్లు' కొడతాడని చెప్పుకోవద్దూ?

అంజ : ఒరేయ్! లోపలికి పోతావా - పోవా?

రాధ : రామం! ఎద్దు ఈడతీసుకుంది. దొడ్లోకి వెళ్ళి కట్టేయ్.

రామం : సరే - మీరే మాట్లాడుకోండి (మూతి ముడుచుకు లోపలకు వెళ్ళిపోతాడు)

సారథి : ఒకటికాదు పది రేడియోసెట్లు కొనేశక్తి ఉంది భద్రయ్యకు. కాని ముచ్చటగా పంచాయతీ రేడియో దగ్గరకు రమ్మంటే రాకపోవడమా-అంట! పదిమందితో

కలిసి బ్రతికిన బ్రతుకు బ్రతుకుగాని – ఒంటెత్తు వ్యవహారం, ఛన్ – పనికిమాలిన పని. ఏబ్రాసి పని.

సత్యం : రాకపోవడానికి నామీద కోపమేమో!

సారధి : సందేహమా?

సత్యం : నేను క్రొత్తగా వింటున్నాను.

సారధి : అసలు నీవు ప్రెశిడెంటుగా ఉండడమే ఆయన ఒంటికి పడదు. నీపేరు ప్రసంగంలో వచ్చినప్పుడల్లా ముఖం తుమ్మల్లో ప్రొద్దూకినట్లయిపోయి ధుమధుమలాడుతూ ఉంటుంది.

సత్యం : ఏమిటీ

సారధి : ఏమిటేమిటి? జనంలో నీకు పలుకుబడి లేకుండా పోయి నువ్వు ఎందుకూ కాకుండా పోయినరోజున ఆయన కళ్లు చల్లగా ఉంటాయి. అప్పుడు నీమీద కోపం ఉండనే ఉండదు. కంట్లోతగిలే పుల్లల్లే నువ్వు కనిపిస్తుంటే కోపం ఉండదూ? నువ్వేకాదు, ఆ స్థానంలో తానుతప్ప ఎవరున్నా కోపమే భద్రయ్యకు.

సత్యం : మురళి కీ పాఠం పట్టలేదల్లే ఉందే!

సారధి : అందుకనే రేడియో ప్రారంభోత్సవం రోజున వచ్చాడు. ఇంటిదగ్గఱ చివాట్లుకూడా తిని ఉంటాడు. మరి చక్రం 'సనేమిరా' రాలేదు చూశావా? భద్రయ్య అంశ సగం ఉంది వాడిలో.

అంజి : ఇవ్వాళ చక్రం పాలేళ్ళను అదమాయించాడు.

సారధి : ఆ తర్వాత చూడు చక్రం బదుకు ఇంట్లో – చచ్చే చివాట్లు తింటాడు.

సత్యం : (లేచి) వస్తా ! చాలాసేపయింది ఇల్లు బయలుదేరి.

సారధి : నేనూ వస్తా. నా ధోరణికేంలే. ఎప్పుడు 'కీ' యిస్తే అప్పుడే అలారం గడియారం మ్రోగినట్లు వాగుతాను. అంజయ్యన్న ఇంకా అన్నం తినలేదు.

(సారధీ, సత్యం, వారి వెనుక, అప్పుడే ఇంట్లోనుంచి వచ్చిన రామం వెళ్ళిపోతారు. అంజయ్య లోపలకు రాధతో వెళ్ళి, భోజనం చేసిన తర్వాత మూతి తుడుచు కున్నట్లుగా మూతి తుడుచుకుని వక్క వేసుకుని నమ లుతూ బయటకు వెళ్ళిపోతాడు.)

రాధ : (బయటకు వచ్చి తమలపాకులు వేసుకుని పుస్తకం తెఱచి పాడుకుంటుంది సన్నగా)

ఊదరా ఒకసారి
మురళి – చెలువుడా
ఊదరా ఒకసారి
మురళి.

పిల్ల నా యెడద నీ
పిల్లన గ్రోవితో
జిల్లు మనిపించి
పోరా.

నీవు పాడిన వెనుక
క్రోవిసొంపులు, ఎడద
తావులను విరజిమ్మ్మె
రా.

పరిమళ మ్మ్మె యెడద
భరియింప లేనురా
దొరవు నీ కిచ్చేన్స్తు
రా.

ఊదరా నీ మురళి
ఊదరా చెలువుడా
నాదమ్మె నా యెడద
రా.

ఊదరా ఒకసారి
మురళి...

మురళి : (ప్రవేశించి నిశ్శబ్దంగా నిలబడుతాడు)

రాధ : (కొంతసేపటికి చూసి సిగ్గుపడుతుంది) కూర్చో మురళీ ! ఎంతసేపయింది వచ్చి ?

మురళి : ఇంతకుముందే – నువ్వు పాట బాగా పాడుతావు రాధా !

రాధ : ఈ స్తోత్రపాఠా లెప్పటినుంచి నేర్చుకున్నావ్ ?

మురళి : నువ్విప్పుడు పాడినపాట చాలా బాగుంది. ఏం పుస్తకం అది రాధా ? (అంటూ కూర్చుంటాడు)

రాధ : ఏదో పాటల పుస్తకంలే! (అని మెడ త్రిప్పుతుంది. తలలో బరువైన పూలచెండు మెడతోపాటు తిరుగుతుంది)

మురళి : ఏం పాటలు? ఇందాక నువ్వు పాడిన పాటలలాంటి వేనా?

రాధ : అనుకో!

మురళి : మధురగీతా లన్నమాట! వసంతకాలంలో కోకిల కూస్తుందంటారు. అది ఎంతో నిజం!

రాధ : ఊ! (అని నిట్టూర్చి లేస్తుంది)

మురళి : లేచిపోతావేం?

రాధ : నా కింట్లో చాలా పని ఉంది. ఏదో పెద్దమనిషివి వచ్చావని కూర్చుంటే వసంతాలు, కోకిలలూ అంటావాయె.

మురళి : అననులే. కూర్చో.

రాధ : (కూర్చుంటుంది) మురళీ!

మురళి : (ఉలికి పడతాడు)

రాధ : (కళ్లు సగం వాల్చి మురళి వంక చూస్తూ నిద్దాగా) మొన్న మనసు బాగోక వచ్చానన్నావు. ఆట్టే చూస్తే ఇవాళే నీ మనసు చెడిపోయినట్లు కనిపిస్తోంది.

మురళి : (తాపీగా) అయితే నువ్వు కవిత్వం వ్రాయవచ్చు.

రాధ : ఎందుచేత?

మురళి : పరిశీలనా శక్తి ఉంటే కవిత్వం వస్తుందని మొన్న నువ్వేగా అన్నది!

రాధ : మొన్నటి మాటలన్నీ అప్పచెప్పటానికి వచ్చా వన్నమాట.

మురళి : (నెమ్మదిగా) లేదు రాధా! (తలవంచి) మొన్న మీ నాన్నను మా నాన్న అనవసరంగా మనస్సు నొప్పించాడు. అందుకు నేను చాలా బాధపడుతున్నాను. ఆ విషయం...

రాధ : ఏవో చిల్లర తగాదాలు వస్తూఉంటై పోతూఉంటై - ఊరన్నతర్వాత. సర్దుకుపోయేవాళ్ళకు ఏ బాధాలేదు. కాని రాపాడిస్తే ఇవే పెద్దవవుతై. గోటితో పోయే వాటికి గొడ్డళ్లు కావలసి వస్తై. ఇంతకీ - మనం అదృష్ట వంతులం!

మురళి : నిజం రాధా! మా చక్రం ముందుగా వెళ్ళి వెళ్ళడంతోనే సర్దుబాటు చేసేశాడు.

రాధ : మీ నాన్నగారు చక్రాన్ని చూసినట్లే నిన్నుకూడా చూస్తారా మురళీ!

మురళి : ఎందుకు చూడరు? నేనుమాత్రం కొడుకును కానా? మా అసలు అమ్మ లేకపోయినా ఉన్న అమ్మ బాగానే చూస్తుంది.

రాధ : నీ కుటుంబవిషయా లడగడం మంచిదికాదే అనుకో-

మురళి : ఏమిటి సందేహం రాధా?

రాధ : మీ నాన్నా, చక్రం, అనుభవించే ఆస్తి మీఅమ్మ దిటగా అసలు!

మురళి : నేనూ అల్లాగే విన్నాను. అయితే ఏం? ఎవ రనుభవిస్తున్నారు! మా అమ్మగారికి పూజ్యుడైన మా నాన్నగారూ వారి కిష్టులూ. అయినా నాకేమీ లోపం చేయడం లేదుగా–

రాధ : అసలు నీ తరహాయే వేరు మురళీ!

మురళి : పోనీ! నువ్వన్నా నన్ను సరిగ్గా అర్థం చేసుకు న్నావు! ఈ పల్లెలో ఎందరో చెప్పారు మా నాన్న గారిలో నన్ను పంచుకోమని – లేదా మా అమ్మ ఆస్తి అడగమని. చెప్పినవాళ్ళు నామీద ఇష్టంతోనే చెబు తారు కదా – అందుచేత వాళ్ళంటే ఇష్టమే నాకు. కాని వాళ్ల కోణంలోనుంచి చూచి వాళ్ళు సలహా ఇస్తున్నారు. అందుచేత వాళ్ళమీద జాలి. నేను నవ్వి 'సరే' అని మెదలకుండా ఊరుకున్నాను.

రాధ : నీ ఔదర్యాన్ని నేను అర్థం చేసుకోగలను కాని –

మురళి : ఆ–కాని, వదలివేయాలి. నేను నా జీవితాన్ని దేశ సేవకు అంకితం చేయదలచుకొన్నాను. మీ నాన్నగారు పాల్గొన్ననాటి ఉద్యమాలలో నేను పాల్గొనలేకపోయా ననే విచారం నాకు ఉంది. స్వాతంత్ర్య పోరాటానికి మీనాన్నగారు జీవితాన్ని ఎల్లా అంకితం చేశారో నవ భారత నిర్మాణానికీ నా జీవితాన్ని అంకితం చేయదలచు కొన్నాను. మా నాన్నగారి ఆస్తి విషయం అది ఒక ఔదార్యమూ త్యాగమూ కానేకాదు. ప్రపంచంలో ఒక జాతి పటిష్టంగా నిర్మింపబడడానికి ఒకతరం చాలక పోవచ్చు కూడా. అయినా మన విధ్యుక్త ధర్మాన్ని

మనం నిర్వహిస్తూ ఉండాలి. చూడు రాధా! మానాన్న నాకు ఆస్తి ఇచ్చినా అసలు ఇవ్వక పోయినా నేను ఏదో కొంచెం చదువుకున్నాను. నా బ్రతుకు నేను బ్రతక గలను. నా భార్యను నేను పోషించుకోగలను.

రాధ : భార్య అంటున్నావు. పెళ్లి ఎక్కడయినా నిశ్చయం అయిందా (ఏమిటి)

మురళి : నీకు తెలియకుండా ఎల్లా అవుతుంది రాధా

రాధ : (తెల్లబోయి, నిబ్బరంగా) ఒక స్కూలులో చదువు కున్నందుకు ఆ మాత్రం గోప్యం ఉంచావు!

మురళి : రాధా!

రాధ : (జాలిగా) ఏమిటి మురళీ!

మురళి : (నిట్టూర్చి) ఆ! ఏమీలేదు.

రాధ : ఏదో చెప్పాలనుకుంటున్నావు.

మురళి : (తల అడ్డంగా త్రిప్పుతాడు)

రాధ ,? తల అబద్ధం ఆడినా నోరు ఆడలేకపోతోంది.

మురళి : నిన్ను చూస్తుంటే జాలివేస్తోంది రాధా!

రాధ : ఎందుకనీ ?

మురళి : తల్లిలేని పిల్లవి. ఎంతో మంచిదానివి. నిన్ను మీ నాన్న తీసుకెళ్లి ఏ 'కానివాడి' చేతిలోనైనా పెడతా డేమోనని.

రాధ : నీకున్నది జాలో భయమో నాకు తెలియదుకాని, మా నాన్న అంత 'జవాబుదారీ లేని మనిషి' కాదు మురళీ!

మురళి : ఎల్లాగయినా తల్లి ఉన్న దారి వేరు.

రాధ : నిజం, మురళీ ! నేను ఇందాక చెప్పిందీ అదే. నాకు కూడా నీవు తల్లి లేని పిల్లవాడవనే జాలి.

మురళి : ఇంకేం ఇద్దరికీ ఒకరిని చూస్తే ఒకరికి జాలి.

(ఇద్దరూ పకపకా నవ్వుతారు. చక్రం ప్రవేశిస్తాడు)

రాధ : రా ! చక్రం ! మంచి కథ పట్టులో వచ్చావు.

చక్రం : (తీక్ష్ణంగా చూచి) కథ ఎంతవరకు పోయిందేమిటి ?

రాధ : అదేమిటి చక్రం ఉడుకుపోతుతనంగా మాట్లాడుతున్నావు ?

చక్రం : కాకపోతే మరేమిటి ? నాకు మా మురళి అంటే కోపంగా ఉంది. నిన్న నాకన్న ముందే వచ్చి ఇక్కడ కూర్చున్నాడా–పాలేళ్ళను వెళ్లి మందలించకపోయాడా ? ఆ తగాదావృద్ధి అయితే మన కుటుంబాలకు శాశ్వతంగా విరోధంవచ్చేసేదే కదా !

రాధ : (నెమ్మదిగా) నీతో చెప్పేదాకా మురళికా విషయం తెలియదు చక్రం. మా చక్రం తగాదా చంపేసి మంచి పని చేశాడని ఇంతకు ముందే అన్నాడు మురళి. చక్రం! చదరంగం తీసుకురమ్మన్నావా ?

చక్రం : (ఊరుకుంటాడు)

రాధ : (తీసుకువచ్చి బలాలు అమరుస్తుంది)

చక్రం : ఎవరెవరితో ఆడాలి ?

రాధ ; రామం లేడుగా ! మురళీ నువ్వూ ఆడండి.

(మురళి, చక్రం, ఎత్తులువేస్తూ ఉంటారు. రామం ప్రవేశిస్తాడు)

రామం : సారధి బాబాయి, నాన్నను బస్తీకి తీసుకువెళ్లాడే.

రాధ : దేనికిరా ?

రామం : సారధి బాబాయేమో కూతురుకు సారె సామానులు కొనాలిట. నాన్నేమో నీకు రేపు పుట్టినరోజుకదా అని ఏదయినా చీర కొనుక్కురావాలని వెళ్ళాడు. ఇద్దరూ బయలుదేరి వెళ్లిపోయారు.

చక్రం : రేపు నీ పుట్టినరోజా రాధా ? చెప్పావు కాదేం !

రాధ : ఇవాళ నువ్వు రావడమే కారాలు మిరియాలూ నూరుతూ వచ్చావాయె ! ఇంకా చెప్పే దెక్కడ ?

రామం : చెప్పేదేమిటి లేవే అక్కా. అమ్మ ఉన్నదా సంతోషించడానికి ? ఎవరు సంతోషిస్తారు ?

చక్రం : మీ అక్కయ్య ఈపాటికి పెళ్లిచేసుకుంటే మొగుడు సంతోషించేవాడు రామం !

రామం : మొత్తంమీద చక్రంగారు భద్రయ్యగారి అబ్బాయి అనిపించాడే అక్కయ్యా !

మురళి : (తలవంచుకుని చదరంగంకేసి చూస్తూ ఉంటాడు)

రాధ : ఎత్తులు వేస్తూ ఉండు చక్రం ! పాడిపశువులకు తొట్లో కుడితి పోశాడోలేదో పాలేరు – చూసి వస్తాను (లోపలకు వెడుతుంది)

(కొన్ని ఎత్తులు వేసి ఆట పూర్తి అయి మురళి, చక్రం వెళ్ళిపోతారు. రాధ ప్రవేశిస్తుంది)

రాధ : రామం! వాళ్లు వెళ్ళిపోయారా ?

రామం : వెళ్లారే అక్కా. మూడు ఎత్తుల్లో చక్రం ఆట 'తోసిరాజ' యింది. చక్రం ముఖం ముడుచుకు వెళ్లాడు. మురళి తాపీగా వెళ్ళాడు.

రాధ : ఏంరా రామం ! నీకు జ్ఞానం ఎప్పుడొస్తుందిరా ?

రామం : (తెల్లబోయి) ఏం అక్కా !

రాధ : చక్రాన్ని భద్రయ్యగారి అబ్బాయి అనిపించాడని సులారించి పారేశావు కదా – నీ ఈడెంత ? భద్రయ్యగారి ఈడెంత ?

రామం : (మాట్లాడడు)

రాధ : నిన్ననే కదా చక్రం ఒక పెద్ద తగాదా తప్పించాడు! పాపం ! అతన్ని ఎందుకు తేలిక పరచడం ? భద్రయ్యగారు మురళికి మాత్రం తండ్రి కాదూ ? తన తండ్రి మంచివాడు కావచ్చు – చెడ్డవాడు కావచ్చు – కాని ఇతరులంటూ ఉంటే ఎవరయినా సహిస్తారా ?

రామం : చక్రాన్ని చూస్తే నాకు చిటచిట లాడుతుందే అక్కా. పెళ్ళి చేసుకుంటే మొగుడు సంతోషిస్తాడని నిన్నెందు కనాలి ? మా అమ్మ ఉన్నదా సంతోషించడానికి – అని నేను విచారంతో అంటే చమత్కారం పోతాడేమిటి – చమత్కారం ! అల్లా కట్టె విఱచి

పొయిలో పెట్టినట్లు ఆ మనిషి మాట్లాడినప్పుడు నేను మొహం తగలేస్తే ఏం ?

రాధ : చక్రం విరసుడే అనుకో. తొందరపడే అన్నాడు. అతను అల్లా అనడంతో నాకూ కష్టమే తోచింది. కాని అది మనిషిలో చెడ్డతనం కాదు. అతని తీరు. దానిని మనం గమనించకుండా ఉంటే సరిపోయె !

రామం : మురళి నొచ్చుకుంటాడని నే నూహించ లేదే అక్కా !

రాధ : అసలు మురళి ప్రకృతే వేరు. అతని యెదుట నువ్వు చక్రాన్ని అన్నా తనను అన్నట్టే బాధ పడతాడు.

రామం : అయితే - అక్కా ! నీ విచారం మురళి బాధపడ తాడనా ? చక్రం బాధపడతాడనా ?

రాధ : ఏమిటా తలతిక్క ప్రశ్నల్లు ? మనం మన ఇంటికి వచ్చిన వారిని ఎవరినీ నొప్పించరాదు. వాళ్లు ఇల్లులేక వచ్చారా - వాకిళ్ళులేక వచ్చారా మన ఇంటికి ? ఏదో చాలాకాలంనుండి రాకపోక లున్నవి కనుక వచ్చారు.

రామం : అసలు చక్రాన్ని చూస్తే - మన దేశం మనిషిని చూసినట్లుండదే అక్కా !

రాధ : అల్లాగా !

రామం : అక్కా! చక్రం వచ్చినప్పుడు చూస్తూ నా నోటికి తాళం వేసుకునే బదులు, నేను ఇంట్లోనుంచి బయటకు వెళ్ళిపోతానే అక్కా !

రాధ : (పెదవి విరుస్తూ కళ్లతో నవ్వుతూ) బాగుందమ్మా! తెలివి!

రామం : అక్కా! నీకు కోపం రాకుండా ఉంటే ఒక్కటి చెబుతాను.

రాధ : (ఏకాగ్రంగా చూస్తూ) ఏమిటిరా అది?

రామం : నువ్వుకూడా వాళ్ళతో చొరవగా మాట్లాడడం చేతనే వాళ్ళు ఇంకా ఎక్కువ చొరవగా మాట్లాడుతున్నారే –

రాధ : నువ్వన్నది కొంత నిజమేరా రామం. మన ఊళ్ళో వాళ్ళకన్న నేను చొరవగానే మాట్లాడుతా.

రామం : ఎందుచేతే అల్లా మాట్లాడడం?

రాధ : అది అలవాటురా. నేను బస్తీలో చదివినప్పుడు నా స్నేహితురాళ్ళ దగ్గర ఈ పద్ధతి పట్టుపడింది. కాని ఇక్కడ పట్టిస్తుంది. తగ్గించుకోవాలి. తగ్గించుకుంటాను లేరా.

రామం : (సంతోషంతో) నువ్వు మంచిదానవే అక్కా. (అని గంతులువేస్తాడు.)



# చతుర్థాంకము

సారధి : అంజయన్నా !

రాధ : రా; బాబాయి. కూర్చో. దాహం కావాలా ?

(ఇద్దరూ కూర్చుంటారు)

సారధి : అక్కర్లేదమ్మా. నిన్న బస్తీలో చుట్టాలింటికి వెళ్లి కాస్త దాహం తెచ్చిపెట్టమ్మా అన్నా. ఆ అమ్మాయి బి. యె. ప్యాసయింది. తెల్లబోయి అల్లా నుంచుంది – అంతే.

రాధ : ఎందుచేత

సారధి : ఆ అమ్మాయి చదువుకున్న పుస్తకాలలో 'దాహం అవుతోంది' అనే వాక్యాలే చదివి ఉంటుంది. కాని మన పల్లెటూరి మాటల్లో, దాహం అంటే మజ్జిగ అనే అర్థం ఆ అమ్మాయికి తెలియందే. మన పలుకుబడి ఆ అమ్మాయికి తెలియలేదని తెలిసిన తర్వాత మజ్జిగ తెమ్మన్నా. తెచ్చి యిచ్చింది.

రాధ : వాళ్ళకు పాడి ఉందా బాబాయి ?

సారధి : పాడెక్కడిదమ్మా. బస్తీలో ఏ కొద్దిమందోగాని గేదెను మేపుకోలేరు. బర్రెను మేపటం అంటే మాటలా బస్తీలో. బస్తీకివెడితే అసలైన మజ్జిగకు అసలైన నేతికి మొహం వాయాలసిందనుకో. ఇంతకీ – అంజయ్యన్న ఏడీ?

రాధ : బయటకు వెళ్లాడు బాబాయి, ఎవరయినా వస్తే 'ఇప్పుడే వస్తాను కూర్చో'మని చెప్పమన్నాడు. ఇంతకీ సారెసామాను లేం కొన్నావు బస్తీలో -

సారధి : బుల్లెమ్మా! మీ నాన్నయితే ఖద్దరుకొట్లోకి తీసుకొని వెళ్ళాలని చూశాడుకాని, నేనే చేనేత దుకాణం లోకి దారితీశాను. ఎల్లాంటి మంచి చీరలు వస్తున్నాయనుకున్నా విప్పుడు! ఆ రకాలన్నీ చూసేసరికి కళ్లు తిరిగిపోయినయ్యంటే నమ్మ.

రాధ : అవును బాబాయి. ఇప్పుడు అమెరికానుంచి కూడా మన చేనేత చీరలకు ఎగబడుతున్నారట !

సారధి : నేనూ అదే విన్నా. ఇదివఅకు సీమగుడ్డ వచ్చిపడేదా - మనవాళ్ళందరూ దానికి మోజుపడేవాళ్ళు. ఇప్పుడు మన గుడ్డలకు వాళ్లు మోజుపడుతున్నారు.

రాధ : అవును బాబాయి. ఓడలు బళ్లవుతై, బళ్లు ఓడలవుతై.

సారధి : మనదేశంలోకూడా మిల్లుమీద బట్టలు తయారవుతున్నవి కదా - మన చేనేతబట్టలు మన్నినట్లు అవి మన్నవు.

రాధ : కట్టుకోగా కట్టుకోగా గుడ్డ పీలికలయినా కావలసిందే కాని రంగుమాత్రం తగ్గదు. అలాంటి మంచి చీరలు వస్తున్నై. అవునుకాని ఏ యే చీరలు చూశావేమిటి అక్కడ ?

సారధి : ఒక్క- రకమేమిటి - అన్నిరకాలూ చూశాం. మంగళగిరి చీరలు. పెడన చీరలు, కప్పలదొడ్డి చీరలు, గుంటూరు చీరలు, వెంకటగిరి చీరలు, ఉప్పాడ చీరలు, కె. జగన్నాథపురం చీరలు, బండారులంక చీరలు, మరి దేవుడు మేలు చేస్తే - మాధవరం, పుల్లంపేట, ఉప్పర, పల్లి, పాటూరు, పోచంపల్లి, గద్వాల, సిద్దిపేట, జన గామ, ఆలేరు, బందరు కలంకారీ చీరలు ఇంకా ఎన్నో రకాలు చూశాం. అన్ని చీరలూ బాగానే ఉన్నాయి కాని, అన్ని కొనగలమా, అమ్మా!

రాధ : ఏం చీరలు కొన్నావేమిటి ?

సారధి : గుంటూరు చీరొకటి, పోలవరం చీరొకటి, వెంకట గిరి చీరొకటి, కె. జగన్నాథపురం చీరొకటి, బండారు లంక చీరొకటి, పోచంపల్లి చీరొకటి, గద్వాల చీరొకటి, సిద్దిపేట చీరొకటి, మాధవరం, ఉప్పాడ, పెడన, ఒక టొకటి కొన్నా - అంతే!

రాధ : (ఆ చీరలు పేర్లతో వేళ్లు మడవడం ప్రారంభించి చీరలు ఆఖరుకావడంతో ముగిస్తుంది) ఇంకేం పదకొండు చీరలు కొన్నావు.

సారధి : ఏదోలే ఆడపిల్ల. మా నాన్న పెట్టాడని చెప్పాకు కట్టుకుంటుంది. ఇంటి ఆడపడుచు మనమలనెత్తినా పుట్టింటికేసే చూస్తూ ఉంటుంది. మనకున్నంతలో మనం ఆడపిల్లకు లోపం చేయకూడదు.

రాధ : మంచిదే బాబాయి. నువ్వన్నా ఆడవాళ్ళ తరఫున మాట్లాడుతున్నావు.

సారథి : ఎమ్మిగనూరు దొకటీ, తాడిపత్రి దొకటీ దుప్పట్లు కొన్నా. వరంగల్లు జంపకానా ఒకటి తీసుకున్నా. ఎప్పుడయినా అల్లుడొస్తే ఇంట్లో ఉంటుందని 'మోరీ' ధోవతుల చాపొకటి ఖరీదుచేశా. మా యింట్లో బల్లలమీదికి బందరు అద్దకాలగుడ్డా, కరీంనగరం గుడ్డా తీసుకొన్నా.

రాధ : (తృప్తితో) బాగుంది బాబాయి.

సారథి : ఎందుకు చెప్పకపోవాలి – అమ్మాయి కొక ఏలూరి తివాసీ కొన్నా బుల్లీ !

రాధ : (నవ్వుతూ) చల్లచల్లగా బయట పెడుతున్నావు. ఇంకా ఏం కొన్నావో చెప్పేశేయి.

సారథి : అబ్బే – ఏం కొనలేదు బుల్లీ. చీరలు అంతవఱకే.

రాధ : కొండపల్లి బొమ్మలు కొన్నావా బాబాయి ?

సారథి : కొన్నానమ్మా. ఎంత చూడ ముచ్చటగా ఉన్నాయనుకున్నావు ? తెల్లపొణికి కఱ్ఱతో తయారు చేస్తారుట ఆ బొమ్మలు. ఆ కఱ్ఱ కొండపల్లి ప్రాంతాలలోనే దొరుకుతుందిట ! దశావతారాల సెట్టు ఒకటి, ఏనుగం బారీ బొమ్మ ఒకటీ కొన్నాను.

రాధ : మరి తిరుపతి చందనం బొమ్మలూ ?

సారథి : కొన్నా బుల్లీ. ఇంకా ఏటికొప్పాక బొమ్మలూ, నక్కపల్లి బొమ్మలు కూడా కొన్నాను.

రాధ : (నవ్వుతుంది)

సారథి : ఎందుకమ్మా నవ్వుతున్నావు ? నెమ్మదిగా ఒక్కొక్కటి బయట పెడుతున్నావనా ? నీకెందుకు చెప్పక పోవాలి – విశాఖపట్నం దంతపు పెట్టె ఒకటి కొన్నానమ్మా.

రాధ : (హృదయపూర్వకంగా) దాని పనితనం బాగుంటుంది బాబాయి !

సారథి : ఏవో కప్పులంటే సాసర్లంటే – మన గూడూరువి లేవూ – పింగాణీ సామాను, అవి కొన్నాను.

రాధ : ఊహు.

సారథి : కాగితం గుజ్జుతో తయారుచేసినవి, బంగారు రంగువి. శంకరుడు–పార్వతి జంట బొమ్మ ఒకటి కొన్నాను. అది మన మచిలీపట్టణంలోనే తయారయిందిట !

రాధ : మరి నిర్మల ప్లేట్సు కొనలా ?

సారథి : కొన్నానమ్మా. నటరాజు బొమ్మ ఒకటీ పూల కుండు ఒకటి కొన్నా. మంచి పనితనం ! అయితే బుల్లి ! ఇవన్నీ నువ్వెక్కడ చూశావు ?

రాధ : విజయవాడలో ప్రభుత్వ విక్రయశాలలో చూశా బాబాయి. హైదరాబాదు ఎగ్జిబిషన్‌లో కూడా చూశా. అక్కడ మన ఆంధ్రప్రాంతానివే కాక భారతదేశంలో తయారయిన మంచి పనితనంగల సామానులు వస్తై.

(అంజయ్య ప్రవేశిస్తాడు)

రాధ : బాబాయి మొత్తం బస్తీనే కొనేశాడు నాన్నా చెల్లాయి సారె క్రింద.

అంజ : (కూర్చుని) కొనదగినవాడు కొనకపోతే ఆయా వృత్తులకు ఎల్లా ప్రోత్సాహం లభిస్తుందమ్మా.

రాధ : నిజమే నాన్నా.

అంజ : యంత్రం సహాయంకూడా అవసరం అవుతూ ఉన్నా నిజమైన అందం మన చేతిపనులలోనే ఉంది. ఒకటే నమూనాలో విరివిగా ఉత్పత్తి చేస్తుంది యంత్రం. చేతి పనివాడు తన బుద్ధి వైభవాన్ని బట్టి చిత్ర విచిత్రంగా నిత్య నవీనంగా వస్తువును తయారు చేస్తాడు.

సారధి : మనవాడు తయారు చేశాడు వస్తువునూ అంటే - మనకు దానియందు ఎంతో ఆప్యాయత కలుగుతుంది. ఈ ఆప్యాయత మనకు మర సరుకుమీద ఉండదు. అదీ కాక ఆ వృత్తి వల్ల మన ఇరుగుపొరుగువాళ్ళు జీవిస్తు న్నారు. వారి డొక్కలు మాడుతూఉంటే మనం తినే అన్నం మనకు జీర్ణం అవుతుందా ?

అంజ : చూడు, సారధీ ! ఎంత లేనివాడూ కూడా తన కూతురు అత్తవారింటికి వెళ్ళేటప్పుడు తన ఓపాన శక్తిగా ఏదో చీరసారె ఇచ్చి పంపిస్తాడు. ఈ సందర్భాలన్నీ మన కళలను పోషించేవే. మన కుటీర పరిశ్రమలను మనం నిరాదరిస్తే మనమే మన చుట్టూ ఆకలిమంటలను రగిలి స్తున్నామన్న మాట. అది మనకూ క్షేమం కాదు, దేశానికీ క్షేమం కాదు.

సారధి : నీ ప్రసంగం వింటుంటే సత్యాగ్రహపు రోజులలో నీ ఉపన్యాసాలు జ్ఞాపకం వస్తున్నై.

అంజ : భారతీయుని జీవితమే కళామయమైనది సారధీ. అన్నం తిని అవతల పారవేసే విస్తరిని సైతం మనవాళ్లు తీర్చి కుడతారు. తాటాకులతో అందమైన దిళ్లు అల్లుతారు. వేముతో సొగసైన కుర్చీలు తయారు చేస్తారు. వట్టివేళ్ళతో అందంగా విసన కఱ్ఱలు కడతారు. త్రాగే పాత్రలమీద పూలు చెక్కుతారు. ఇప్పుడు పెట్టే దర్వాజాల మోస్తరుగా దిశగా బోసిగా ఉంచకుండా దాని మీద పూలు, బొమ్మలు చక్కగా చెక్కేవారు. మనం నిన్న చూడలా నరసాపురం లేసులు - అంత అందంగా దర్వాజా తెర లల్లుతారు.

సార : నువ్వు వెనక చెప్పేవాడివి కాదన్నా - డక్కా పనివాళ్ల సంగతి.

అంజ : అవును. అగ్గిపెట్టెలో చేనేత వస్త్రాన్ని అమర్చే కళాకారులు ఒకప్పుడు మనదేశంలో ఉండేవారు. అలాగే కందికాయలో జంధ్యం అమర్చే వారుట! మనకు స్వాతంత్ర్యం వచ్చిందీ అంటే - మన ప్రథమ కర్తవ్యం ఏమిటంటే జీర్ణమైపోతున్న కళలను పునరుద్ధరించుకోవడం ద్వారా వృత్తులను పోషించుకోవడం.

రాధ : నిజం, నాన్నా!

అంజ : ఆనాడు పరాయి దొరతనంలోని అధర్మం ప్రజలకు కళ్ళకు కట్టేటట్టు చేశాం. ఈనాడు మనదేశంలో ప్రజలు బ్రదుకవలసిన విధానం కళ్లకు కట్టేటట్టు చేయాలి. అందుచేతనే సారధిచేత డబ్బు సద్వినియోగం చేయించి చక్కని సామానులు కొనిపించా. సత్యాగ్రహం రోజు

లలో దేశసేవ చేస్తున్నా మనే తృప్తివల్ల బ్రతికాను. ఈనాడుకూడా ఇల్లాంటి మంచిపనులు చేసినప్పుడు అల్లాంటి తృప్తి నాకు కలుగుతూ ఉంటుంది.

సారధి : ఇవాళ నీ పుట్టినరోజుకదా మీా నాన్న తెచ్చిన ఖద్దరుచీర కట్టుకోలేదేం బుల్లెమ్మా!

రాధ : సాయంత్రం కట్టుకుంటా బాబాయి.

అంజ : మనింట్లో కొండపల్లి బొమ్మ క్రొత్త దొచ్చిం దెక్కడి దమ్మాయి?

రాధ : మురళి నా పుట్టినరోజు బహుమతిగా ఇచ్చాడు నాన్నా.

సారధి : చక్రంకూడా ఏమయినా బహుమతి తెచ్చాడా?

రాధ : (నెమ్మదిగా) పారిస్ సెంటు తెచ్చాడు బాబాయి.

అంజ : చూశావా సారధీ! ఇద్దరిలో వ్యత్యాసం - కావడానికి ఇద్దరూ ఒక తండ్రి బిడ్డలే.

(రాధ లోపలికి వెళ్ళిపోతుంది. బయటనుండి రామం ప్రవేశిస్తాడు.)

అంజ : ఏమిరా రామం! ఇవాళ అలా మూతి ములక్కాడల్లే పెట్టుకు వస్తున్నావు. ఎవరిమీాదరా ఆ కోపం?

రామం : భద్రయ్య నోటికి తాళం లేదా నాన్నా?

సారధి : ఎవరు వేస్తారు? వేస్తే నేనే వెయ్యాలి. ఏమని వాగాడేమిటి?

రామ్మ : ఇంకేం వాగుకుంటే ఎవరికి కావాలి?

అంజ : అయితే మననిగురించే నన్నమాట !

రామం : ఇన్ని ఏళ్లొచ్చి, ఇది అనవచ్చు-ఇది అనకూడదు, అని తెలియకపోతే ఎల్లా? భద్రయ్యకు వచ్చాయి, తాటిచెట్టుకూ వచ్చాయి ఏళ్లు. ఏళ్లు రాగానే సరా ఏమిటి?

అంజ : 'అసలుమాట' నీ నోటినుండి వచ్చేసరికి ఊరు మాటుమణిగే టట్టుందేమిరా?

సారధి : ఏదో రోషంవచ్చే మాటే అని ఉంటాడు. పొంగే పొంగే పాలు కనుక, తట్టుకోలేకున్నాడు. ఆ 'ఎక్కు' కాస్త తగ్గనీ.

రామం : గట్టుతగాదాలో తాను చేసినపనే సరి అయినదట! తన చక్రాన్ని రాధ వలలో వేసుకోవడంచేత తన కొడుకే తనకు ఎదురు తిరిగాడట! మురళీ అదే దారిట! ఇదీ ప్రచారం. తాను తన అరుగుమీద పీఠం పెట్టుకు కూర్చొని, వచ్చే పోయేవాళ్లతో చెప్పడం, ఆ విన్న వాళ్లు ముసిముసి నవ్వులు. నవ్వుతూ, ఇచ్చకంగా తల ఊపడం! నాకు తలకోసినట్లుగా ఉంది నాన్నా! ఈరోజు నుంచీ ఆ భద్రయ్య సంతానాన్ని మనగడప త్రొక్క వద్దని 'నూట నలభై నాలుగో' సెక్షన్ ఇచ్చేయినానా! పీడ విరగడై పోతుంది.

అంజ : విన్నావా సారధీ !

సార : విన్నా విన్నా. ఈ భద్రయ్య ఇల్లా వాగుతున్నాడని ఇదివరకే విన్నా.

అంజ : మరి నాతో చెప్పలేదేం ?

సార : చెప్పడానికిదేమున్నా మంచిముక్క కనుకనా ? ఇది వింటే నువ్వు బాధపడతావు. రగడచేస్తే పసలేదు. రామం ! నువ్వు మా యింటికి వెళ్లి నేను ఆలస్యంగా భోజనానికి వస్తానని చెప్పిరా కాస్త - నాయనా.

(రామం వెడతాడు.)

అంజ : భద్రయ్య కిల్లా ఆడిపోసుకోవడం తగునా సారధీ !

సార : బలేవాడివే ! అసలు భద్రయ్య అంటేనే 'బే సబబు' కదా !

అంజ : ఇంటికి వచ్చిన వాళ్లమీద కథలల్లడం ఏం న్యాయం ?

సార : నీపిల్ల 'నిప్పు' అని నాకు తెలుసు అంజయ్యన్నా. (నసుగుతూ) కాని వయసులో ఉన్న ఆడవాళ్లూ మగవాళ్ళూ చనువుగా ఉండడం మన పల్లెల్లో మర్యాద కానట్లు కనిపిస్తుంది.

అంజ : మనం నిజాయితీగా ఉంటే లోకం ఏం అనుకుంటే నేం సారధీ ?

సార : నువ్వుచెప్పేది వినడానికి బాగానేఉంది. కాని 'లోకం ఏమనుకుంటే ఏం' అని నువ్వు బాధపడడం మానలేదు. లోకం అంటే ఎవరు ? నువ్వూ, నేనూ, మిగతాగ్రామం. మన పరిసరాన్ని మనం ఎల్లా నిర్లక్ష్యం చేస్తాం , అంజయ్యన్నా ? ఇతరులు మనని మరొకవిధంగా అనుకోవ

డానికి వీలులేనివిధంగా మనమే ప్రవర్తిస్తే బాగుంటుందేమో!

అంజ : అంతేనా?

సార : అంతే - అన్నా. మనచుట్టూ ఉన్న స్థితిని వదలి మనం జీవించలేం. ఒకరకంగా మనకు రక్షణకూడా మన పరిసరమే. పచ్చని చెట్టుదగ్గర అదేరంగులో పురుగు పుడుతుంది. ఆ రంగే దానికి శత్రువులనుండి తప్పించుకోవడానికి రక్షణ.

అంజ : నీ ఉపమానం క్రొత్తగా ఉందే!

సార : అంజయ్యన్నా. ఏటి కెదురీదడానికి ప్రయత్నం చేయకు. నీకు సిద్ధాంతం బాగా తెలుసును కాని వాస్తవిక పరిస్థితులలో సంఘాన్ని చూడవు. ఒక్కమాట అడుగుతా సమాధానం చెప్పు. బస్తీలలో సముద్రం బీచీలలో, పార్కులలో, ఆడమగ - వారు భార్యాభర్తలయినా కాకపోయినా - చెట్టాపట్టాలు పట్టుకు తిరుగుతారు. ఆ జనసముద్రంలో ఎవరెవరో ఎవరికీ తెలియదు, పట్టించుకోరు.

అంజ : అవును పట్టించుకోరు.

సారథి : అల్లాగే పల్లెటూళ్ళల్లో, తాటితోపుల్లో, తుమ్మబీళ్ళల్లో 'ఆడమగ' కలిసి షికారు వెడితే విడ్డూరంగా పల్లీయులు చెప్పుకుంటారంటావా లేదా?

అంజ : చెప్పుకుంటారు.

సార : కథలలో గాని, సినీమాలోగాని, పడుచుపిల్లలు - ఆడ మగ-పెళ్ళి సంగతి మాట్లాడుకుంటే మనకు వినడానికి బాగానే ఉంటుంది. కాని వాస్తవానికి జీవితంలో యే యే తండ్రయినా అల్లా మాట్లాడడానికి అంగీకరిస్తాడంటావా ?

అంజ : నీ మాటలు భద్రయ్య మాటలు మోస్తరుగానే ఉన్నాయి సారథీ.

సార : నన్ను క్షమించు అన్నా ! నీ వంటే నాకు చాలా గౌరవం. నువ్వు మజ్జిగ తప్ప కాఫీ కూడా త్రాగవు. నిన్ను చూసి నేనుకూడా కాఫీ మానేశాను. నీ ఆదర్శాలన్నీ నాకు నచ్చుతై కాని తల్లిలేని పిల్లకదా అనే జాలితో రాధకు ఇచ్చే స్వాతంత్ర్యం నాకు నచ్చదు. నీ ఉద్దేశం మనం పవిత్రంగా ఉంటే ఎవ్వరేమనుకుంటే మనకేం అని.

అంజ : అంతే.

సారథి : దానికి నేను సుతరామూ ఒప్పుకోను. మన అన్నం మనం తిని మన బట్ట మనం కట్టుకుంటూకూడా మన చుట్టూ ఉన్న లోకాన్ని గమనించాలి. మనుష్యుడు సంఘాన్ని పరిహరించలేడు. కొంతమంది పడుచు కుఱ్ఱవాళ్లు అనవచ్చుగాక లోకాని గ్రుడ్డిలోకం చెవిటిలోకం మూగలోకం అని. కాని నువ్వూ నేనూ అల్లా అనలేం. వాళ్ళ అలవాట్లు మనం మనస్సులో పెట్టుకోకుండా ఏ పని చేసినా విమర్శకు పాత్రులం అవుతాం. మనం

వాళ్ళను అజ్ఞానులని అనవచ్చు. వాళ్ళు మనలనూ అల్లాగే అంటారు.

అంజ : ఇవాళ నీ ఉపన్యాసం క్రొత్తదిగా ఉంది సారధీ!

సార : ఉద్దేశాలు నావే అయినా మాట్లాడేతీరు నీది వస్తోంది. అందుచేత నీకు క్రొత్త చేస్తోందన్నా. పల్లెల్లో ప్రతిదీ ప్రతివాళ్లకు కావాలి. ఒక కోణంలో చూస్తే అది మంచిది కాకపోవచ్చు. కాని మరొక కోణంలో నుంచి చూస్తే అది మంచిదే. మనపెద్దలు వసుధైక కుటుంబంగా జీవించాలంటారు. దానికికూడా ప్రాతిపదిక గ్రామమే. గ్రామం అంతా ఒక కుటుంబం అని అనుకుంటే అన్ని విషయాలూ అందరికి పడతై. పెళ్ళి అయితే ఊళ్లో పెద్దా పిన్నా వచ్చి చాకిరీకి నడుం కడతారు. మనిషిచస్తే శవదహనం అయేదాకా నిప్పు రాజేయరు.

అంజ : నేను పల్లెలు మంచివి కావన్నాననుకుని నీవు సమాధానం చెప్పాలని ప్రయత్నం చేస్తున్నావు సారధీ!

సార : అదికాదన్నా! పల్లెల్లో సంఘంవెనుక తత్త్వం చెబుతున్నా. పల్లెల్లోకి క్రొత్తమనిషి వస్తే గ్రామసింహాలు మొఱగడమే కాకుండా ఊళ్లో ప్రతివాళ్లూ ఆరాతీస్తారు. బస్తీల్లో ప్రక్క-యింట్లో ఎవరు కాపురం చేస్తున్నారో ఎవరికీ తెలియదు. తెలుసుకోవడానికి కూడా ప్రయత్నం చేయరు, ఏ మ్యునిసిపల్ కౌన్సిలరుగానో నుంచుంటే ఓట్లకు వెళ్లాలసివస్తే తప్ప. మనం పల్లెలలో ఉన్నప్పుడు

దాని కనువైన విధంగా మనవిధానాన్ని మార్చుకుంటే వచ్చే నష్టం ఏమిటి ?

అంజ : ఇంతకీ నువ్వు ఇదంతా ఎందుకు చెబుతున్నావో నా కర్థం కావడంలేదు సారథీ !

సారథి : అయితే స్పష్టంగా చెప్పేస్తాను. నేను నీ కుటుంబంలో ఒకణ్ణిగా మెలిగేవాణ్ణి కాబట్టి స్వతంత్రిస్తున్నాను. చక్రం పారిన్ సెంటు ప్రెజెంటుచేస్తే రాధకు, అది విదేశీ సెంటు అని అనేటంతవఱకే నీ ఊహ పోయిందికాని ఒక పెళ్ళికాని పిల్లకు ఒక యువకుడు సెంటు - ఎందుకు ప్రెజెంటుచేస్తాడో నువ్వు ఆలోచించవు. నాకు తెలిసినా నేనేమీా అనుకోను, కాని ఈ విషయం గ్రామంలో బయటవాళ్ళకు తెలిస్తే వాళ్లు ఏదయినా అనుకోవడానికి అవకాశం లేదా ?

(రాధ లోపలనుండి ఏడుపు)

అంజ : ఎవరక్కడ ! రాధా ! ఇల్లారా. (రాధ విచారంతో బయటకు వస్తుంది)

అంజ : వింటున్నావా మా మాటలన్నీ ?

రాధ : విన్నా, నాన్నా ?

సారథి : ఎప్పుడయినా చక్రం పెళ్ళిచేసుకోమని అడిగాడా బుల్లీ ?

రాధ : అడిగాడు బాబాయి.

అంజ : నాతో చెప్పలేదేం ?

సారథి : చిన్నపిల్ల ! ఏం చెబుతుంది ! సిగ్గుకాదూ !

అంజ : (రాధతో) నువ్వేం చెప్పావు సమాధానం ?

రాధ : మా నాన్నగారి యిష్టం అన్నా.

సారధి : బంగారు తల్లి ! అల్లాగే అని ఉంటుంది. నాకు తెలుసు.

అంజ : (విచారంతో) వెళ్లమ్మా ! లోపలకు.

(రాధ లోపలకు వెళ్లిపోతుంది)

అంజ : సారధీ ! నీకు లోకజ్ఞానం హెచ్చు. నీవు పసికట్టింది నేను ఊహించలేకపోయాను.

సారధి : నువ్వు 'తానెంతో జగమంత' అనుకునేవాడివి.

అంజ : అనవసరంగా భద్రయ్యె వాగడాని కవకాశం కల్పించాను.

సారధి : నేనూ అదే అనేది. ఇప్పుడు కొంపలు ముంచుకు పోయేదేమీ లేకపోయినా అట్లాంటివాటికి మనం అసలు అవకాశమే ఇవ్వకూడదు.

అంజ : నిజం. సారధి.

సారధి : నువ్వు ఎల్లాగూ చక్రాన్ని మీ యింటికి రావద్దని చెప్పలేవు. ఆ సంగతి నాకు వదిలెయ్. నేను అన్నీ రైటు చేసేస్తా.

అంజ : ఎల్లా చేస్తావు ?

సారధి : ఎల్లా చేస్తానో నువ్వే చూస్తావుగా. ఇప్పుడే వెడతా.

(బయటకు వెళ్లి తిరిగి వస్తాడు)

సారధి : ఈ సందు మొదట్లోనే నాకు తగిలాడు చక్రం.

అంజ : ఏమన్నా వేమిటి ?

సారధి : నీ నెత్తి కొచ్చేటట్లుగా ఏమీ అనలేదులే. 'అబ్బాయీ ఎక్కడికి వెడుతున్నా'వన్నా. 'ఇక్కడికే' అన్నాడు. 'అయితే అల్లా ఆగ'మన్నాను – అసలు మన కున్న కసి అంతా భద్రయ్యమీద గాని వీడిమీద ఏముంది ?

అంజ : కాదు మరి !

సార : "అబ్బాయీ ! ఇక విను. నువ్వూ రాధా ఎప్పుడో చిన్నప్పుడు కలిసి చదువుకున్నా ఇప్పుడు పెద్దవా ళ్ళయారు. మనం ఉన్నదేమో పల్లెటూరు. పెద్దవాళ్లు ఇంట్లోలేనప్పుడు, వయసులో ఉండి పెళ్ళికాని ఆడవాళ్లూ మగవాళ్ళూ పకపకలాడడం అంత మంచిదికాదు. అందులో నువ్వు పారిస్ సెంటు ప్రెజంటు చేశావని అంజయ్యన్న పసికట్టాడు. తల్లిచాటు పిల్లలేన్న లోకం అనేకవిధాలుగా అనుకోవడానికి అవకాశం ఉన్నప్పుడు తల్లిలేని పిల్ల – పాపం రాధనుగురించి మాత్రం అను కోదా ? అందులో మీనాన్న ఏమీ సజావు మనిషి కాదు. "మా చక్రమూ, రాధా కలిసి చదువుకున్న మొహమాటం చేత పాలేళ్ళను గట్టుదగ్గర ఆపించి తనని ధిక్కరించాడ"ని డప్పులేస్తున్నాట్ట మీనాన్న" అన్నా.

అంజ : ఏమన్నాడు ఆ మాటకు ?

సారధి : ఏమంటాడు ? ఖంగారుపడ్డాడు. నయాపైసంత మొహం చేసుకున్నాడు. "ఒకవేళ నీకు రాధను పెళ్లి చేసుకోవాలనే ఉద్దేశం ఉంటే ముందు మీ నాన్నను,

ఆ తర్వాత రాధతంత్రిడీనీ ఒప్పించవలసి ఉంటుంది" అని అన్నా. మా నాన్న ఒప్పుకోడని తొంటచేయి బయట పెట్టాడు. "అలాంటప్పుడు ఈ కాలక్షేపం బటాణీలు తినడం మానివేయడం మంచిది" అని మెత్తని సలహా చెప్పేశా.

అంజ : ఈ క్రొత్త బటాణీ లెక్కడివి ?

సారధి : ఈ మధ్య నేను రైలులో ప్రయాణం చేస్తూ ఉంటే బెజవాడ ఏలూరుమధ్య ఒక బటాణీలమ్మేవాడు 'కాల క్షేపం బటాణీ' లంటూ ఉప్పులేక ముప్పందుము త్రాగాడు. సమయాని కవి జ్ఞాపకం వచ్చినై. పడుచు వాళ్ళతో మాట్లాడేటప్పు డల్లాగే మాట్లాడలని అది వదిలేశా. దానితో చక్రం ఉక్కిరి బిక్కిరై పెద్దవాళ్లు లేనప్పుడు నేను వాళ్ళయింటికి వెళ్లనులే అన్నాడు. మనకు కావలసిందీ అదేగా.

అంజ : ఈ విషయం మురళికీ తెలుస్తుంది.

సారధి : తెలియకపోతే నేనే చెప్పేస్తా. "అబ్బాయీ చక్రంతో ఇల్లా చెప్పానని". నువ్వూ అని కన్నులో వేలు పెట్టి ఎందుకు పొడవాలీ? చదువుకున్నవాడు ఆ మాత్రం గ్రహించుకోలేడూ ?

అంజ : (నిట్టూర్చి) సరే !

సారధి : సరో - బేసో - ఇక భద్రయ్యా వాగేదానికి ఏమీ విలువ ఉండదు.

అంజ : ఇప్పటికే భోజనానికి ఆలస్యం అయింది పాపం నీకు.

(సారథి వెళ్ళిపోతాడు. రామం ప్రవేశిస్తాడు.)

అంజ : ఒక్కమాట చెప్పిరమ్మని సారథి అంటే ఇంతసేపూ ఏం చేస్తున్నావురా ?

రామం : రేపు ఆగస్టు పదిహేను కాదు నాన్నా ! అందరూ జండాల తోరణాలు కడుతూ ఉంటే నేనూ సాయం చేయడానికి వెళ్ళా.

అంజ : లోపలికి వెడదాం రా. భోజనం చేద్దాం.



# పంచమాంకము

(అంజయ్యా, రాధ, రామం, సారధి ముందు తెర ఎత్తేటప్పటికి ఆసీనులయి ఉంటారు. అంజయ్యా తకిలీ వడుకుతూ ఉంటాడు. గోడకు తిలక్, గాంధీగారల బొమ్మలూ త్రివర్ణ పతాకం తగిలించి ఉంటుంది)

సారధి : పంచాయతీ ఆఫీసులో స్కూలులో ఇంకా అనేక చోట్ల స్వాతంత్ర్య దినోత్సవంలో పాల్గొని వచ్చాం నేనూ మీ నాన్న. అనేక రకాల జాతీయ గీతాలు విన్నాను. రామం ! నీ నోటితో ఒక్కటి అను. వినాలని ఉంది.

రామం : (గొంతుక సవరించుకొని)

ఎన్నాళ్ళకు ఎన్నాళ్ళకు
కన్నా మీ స్వాతంత్ర్యం
అన్ననాన్న ! ఈనాడే
పున్నమలోక వేయి వెలుగు.

నరనరాల సడలించిన
తర తరాల దాస్యమ్మే
మఱచిపోయి ఈనాడూ
పిరిపీల్చితి మెంత స్వేచ్ఛ.

పెర రాచరికపు చాయలు
చిరిగి చిరిగి చెరగిపోయె

తురగలించె కాంతిరేఖ
భరతజాతి మస్తకమున.

భరత జాతి ఎన్నాళ్ళు
కిక్కిరి బిక్కిరియై నలిగెను
వజ్రదళైన త్యాగంలో
దొరకెను స్వాతంత్ర్య ఫలము.

ఎలుగెత్తెను వేనవేలు
వెలుగుల శంఖాల నొత్తి
తలగల దేశాలలోన
తల యెత్తెను భారతమ్ము.

ఈనాడే ఈనాడే
ఈనాడే మనపండుగ
ఏడాదికి ఏడాదికి
ఏడాదికి ప్రతియేటా.

ఎన్నాళ్ళకు ఎన్నాళ్ళకు
కన్నా మీ స్వాతంత్ర్యం.

సారధి : నిజమే. ఎన్నాళ్ళకో మనకు వచ్చింది స్వాతంత్ర్యం. బుల్లీ నువ్వుకూడా ఒకపాట అను.

రాధ : నా దేశం, నా దేశం!
భారత దేశం, నా దేశం.
జగద్గురువు శృంగేరి శంకరుడు

జగత్కవీశుడు వాల్మీకి
జగదుద్ధారము కృష్ణమహాస్సు
జగదాదర్శము రామచంద్రుడు

కొలువుతీర్చిన నా దేశం
వెలుగు నించిన నా దేశం.

జగదుత్తాలము హిమాలయమ్ము
జగత్పవిత్రము గంగా తోయము
జగత్పండితుడు జగన్నాథుడు
జగమెఱిగిన శిబి దానవీరుడు

నా దేశము లోవి
నా దేశము వారు.

కాశ్మీరము మనదీ, కోలారూ మనదీ
గయా ప్రయాగా, కాశీ క్షేత్రం
బృందావనము, బ్రహ్మకపాలం

నా దేశపు నిధులు
నా దేశపు తపసు.

కనకదుర్గ, కలకత్తా కాళీ
కామాక్షీ మీనాక్షీ
అన్నపూర్ణ వారాణసి మాతా

ఉగ్గుపట్టినా నా దేశం
నిగ్గుతేరినా నా దేశం.

సారధి : బాగుంది బుల్లీ! అయితే అంజయ్యన్నా! ప్రపంచం అంతా ఒకటి అని అనుకుంటున్నాం కదా - మళ్లీ నా దేశం నా దేశం అని గిరిగీసుకు కూర్చోవడం మంచిదే నంటావా?

అంజ : నువ్వుకూడా తికమక పడ్డావూ? ఒకదేశం ప్రజలూ మరియొక దేశం ప్రజలూ కలహించుకోకూడదనే అభిప్రాయంతో విశ్వమానవ సౌభ్రాతృత్వాన్ని ప్రబోధించే సందర్భంలో ప్రపంచంలో ప్రజలందరూ ఒకటే అనే ఔదార్యంతో వ్యవహరించాలని పెద్దలు చెబుతారు. అల్లాగే ఒకానొక సందర్భంలో ఒక్క మనుష్యులయందే కాదు, దయకలిగి ఉండవలసింది - జీవకోటి యన్నిటి యందూ - అనీ చెబుతారు.

దేశవిషయం వచ్చినప్పుడు దేశప్రేమను కలిగి ఉండాలి అంటారు. కొంతమంది దానిని దేశభక్తి అని కూడా అంటున్నారు. అల్లా కలిగిఉండడమే జాతీయత. జాతీయతలేని అంతర్జాతీయత లేనేలేదు. ఇంట గెలువ లేనివాడు రచ్చగెలువ లేనట్లుగా.

సారధి : అయితే భారతదేశంలో వారిదందరిదీ భారతజాతి అన్నమాట.

అంజ : అంతే. దేశంఅంటే, వట్టి మనుష్యులూ కాదు వట్టి మట్టీకాదు. ఆ భూమి భౌగోళిక స్వరూపం, అక్కడి ప్రజల ఆధ్యాత్మిక స్వరూపం, రెండూ కలిస్తేనే దేశం

అయింది. అందుచేతనే 'నా దేశం నా దేశం' అని కవులు గానం చేసేటప్పుడు ఆ దేశమందలి జాతి మహత్తర సంస్కృతినీ, ఆ దేశమందలి పవిత్రమైన నదులనీ, ఈ రెంటి సమాహారరూపాన్ని దేశంగా గానం చేస్తారు.

సారధి : అయితే ఈ జాతీయగీతాలు స్వారాజ్యానికి పూర్వం గానం చేశాం. తెల్లవారి దొరతనంమీాద తిరుగుబాటుకు శక్తి నిచ్చినై. ఇప్పుడు వాటి అవసరం ఏముంది?

అంజ : సారధీ! స్వారాజ్యలబ్ధి అనేది ఒక పరిపూర్ణమైన స్థితి కాదు. మనం భారతీయులం. మనకొక జీవితవిధానం ఉంది. దానినే మనం స్వధర్మం అని పిలవవచ్చు. ఈ స్వధర్మానుష్ఠానానికి వైదేశిక ప్రభుత్వం అవరోధంగా ఉంది. మనసొత్తు ననుభవిస్తూ వారి జీవితవిధానాన్ని మనపై రుద్దవలెనని చూచింది. అందుచేత వారిని వెళ్లిపొమ్మని మనజాతి కంఠోక్తిగా పలికింది. పోరాటం సాగించింది. వారు వెళ్లిపోవలసినస్థితి ఏర్పడింది. వారు వెళ్లిపోయారు.

సారధి : ఈ పోరాటాన్ని ఎంతకాలం సాగించిందంటావు మనజాతి అంజయ్యన్నా!

అంజ : ఎప్పుడూ సాగిస్తూనే ఉంది. సిపాయిల కలహం అని లోకంలో ప్రచారం చేయబడింది స్వాతంత్ర్య సంగ్రామమే. ఇటీవల శతవార్షికోత్సవం కూడా చేసుకున్నాం. ఈజాతి పడిపోకముందు అనేకసార్లు ఎదిరించింది వైదేశిక శక్తులను. ఒకే పరిపాలనలో ఇటీవల లేని కారణంచేత దేశంఅంతా ఒక్కుమాటు పడిపోలేదు. అలెగ్జాండరును

పురుషోత్తముడు ఎదిరించడం వినలా? మహమ్మద్ గజనీని పృథ్వీరాజు ఎదిరించడం వినలా? ఇదివఱకు రాజులే పోరాటం జరిపారు. వారిలో అంతఃకలహాలవల్ల వారెంత పరాక్రమవంతులైనా కృతకృత్యులు కాలేక పోయారు. దరిమిలా మనయుగంలో అది ప్రజల పోరాటమయింది. పోరాడే విధానంలోకూడా వ్యత్యాసం వచ్చేసింది. మనం చేసింది 'సత్యాగ్రహం!'

సార : అయితే అన్నా! నే నడిగిన ప్రశ్న అల్లాగే మిగిలి పోయింది.

అంజ : ఇప్పుడు చెబుతున్నా సమాధానం. జాతీయగీతాలు అంటే జాతిని నిత్యం జాగరితంచేసేవి. అవి మనదేశంలో పుట్టిన మహనీయుల గుణగణాలను వర్ణించేవి కొన్ని - ఈ జాతికి శరీరం ఇచ్చి పోషిస్తున్న పృథివి మొదలైన భూతాలను వర్ణించేవి కొన్ని, స్వరాజ్యసంపాదనానికి పూర్వమైతే పోరాటంకోసం స్వరాజ్యసంపాదనానికి పర మైతే దేశ పునర్నిర్మాణాన్ని గురించీ ప్రబోధించేవి కొన్ని; దేశంలోని సమస్యలనుగురించి ప్రజలకు స్పష్ట పరచేవి కొన్ని - జాతి పండుగలకు సంబంధించినవి కొన్ని. జాతి ఉన్నంత వరకూ ఇల్లాంటి గీతాల అవసరం ఉం టుంది. జాతి తత్త్వం జాతీయగీతంలో ప్రతిఫలిస్తుంది. బంకించంద్ రచించిన "వందేమాతరం" ఈ రోజునకూడా సభా ప్రారంభంలో గానం చేస్తున్నాం. రవీంద్రుడు రచించిన 'జనగణమన' మన దేశంలోనూ విదేశాల లోనూ గానం చేయబడుతోంది. అందుచేతనే జాతికి

చిహ్నంగా ఒక భాష అంటే హిందీ, ఒక గీతం అంటే 'జనగణమన' ఒక జెండా అంటే 'త్రివర్ణపతాకం' మన వారు నిర్ణయించారు నేటి పద్ధతుల కనుగుణంగా.

సారథి : అయితే రామం! జండా అంటే జ్ఞాపకం వచ్చిందీ- ఇవాళ జాతి పండుగకదా జండాపాటకూడా ఒకటి పాడు.

రామం : గగన వీధి చూడరా
కంఠ మెత్తి పాడరా
ఎంత ఎత్తు ఎగిరినదో
ఈ దేశపు మనజెండా.

స్వేచ్ఛా వాయువు పీల్చే
స్వేచ్ఛ మైన జీవుడా
భారతీయుడా! ఓయి
భారతీయుడా!

పండిన మన సంస్కృతికి
దండియైన చిహ్నమ్ము
వన్నెల చిన్నెల మూడు
వన్నెల మన జెండా.

వందేమాతరం మనరా
వందనమ్ము సేయరా
జనగణమనముల వెలిగే
జనగణమన పాడరా.

గగనవీధి చూడరా
కంఠమెత్తి పాడరా.

(సత్యం ప్రవేశిస్తాడు రాధ లోపలకు వెళ్ళిపోతుంది)

సారథి : ఏదో క్రొత్త కబుర్లు పట్టుకొచ్చి నట్టున్నాడు మన సత్యం.

సత్యం : (కూర్చుని) ఆ ! ఏమీ లేదు. భద్రయ్య ఈ తఫా తాను గ్రామంలో పార్టీ కట్టి పంచాయతీ ఎన్నికలకు పోటీచేసి ప్రెశిడెంటు అవుతాడుట !

సారథి : (కోపంతో) వీడితరం కాదు. ఇదివరకు గ్రామంలో పంచాయతీ లేనప్పుడు పంచాయతీ కోసం దస్కతు చేయమంటే 'నా కక్కర లేదంటే నా కక్కర లే' దన్నాడు ఈ భద్రయ్యేమటుకు ఈ భద్రయ్య. నువ్వు కృషిచేసి పంచాయతీ గ్రామంలో ఏర్పఱచి ప్రెశిడెంటు అయి రోడ్లకు సైడ్లు తీయించి తూములుపెట్టించి మురుగంతా ఊరుబయట బోదులలోకి నడిపి గ్రామాన్ని ఒక ఆకారంలోకి తెచ్చి బాగుచేస్తూంటే ఇవాళ 'తగుదునమ్మా' అని తాను తయారవుతాడా ! అంటూ'' నీ పుణ్యమా అంటూ అరికాలు బురదకాకుండా ఎక్కడ కురిసిన వర్షం అక్కడ చేరెడి నీళ్లయినా నిలవకుండా ఒంచుకుపోతోందే –

అంజ : నిజం.

సార : మాగాని ఊరుదగ్గఱకు ఒత్తుకొచ్చి ఆడకూతుళ్లకు బయటకు పోవడానికి ఇబ్బందిగా ఉంటే పబ్లికు కక్కోసు దొడ్లు కట్టించాడా లేదా ఈ సత్యం !

అంజ : కాదు మరి !

సార : ఇదివఱకు మన చెఱువు ఎల్లా ఉండేదంటావు ?

రామం : ఆ ! ఎల్లా ఉండేది ! అందరూ త్రాగే నీటి చెఱువులో గొడ్లను దింపేవారు. బట్ట లుతికేవారు. గోగు లూరేసే వాళ్లు. అసలు చెఱువు కొక ఆకారం అంటూ ఉండేదా ? అసలది చెఱువనిపించేదా ?

సార : ఇప్పుడెల్లా ఉంది చెఱువు ?

రామం : కంచమల్లే ఉంది.

సార : గర్భిణీ స్త్రీలు కూడా ఎక్కువ కష్టపడ అక్కర్లే కుండా నీళ్లు తెచ్చుకునేటట్టు పాతిక, పాతిక, ఎత్తు చొప్పున మెట్లు కట్టించాడు కదా ! పశువుల చెఱువు వేరే కేటాయించి దానికి సులాబీ కట్టించాడు కదా. అసలు మన ఊరే ఇతని చేతిలో క్రొత్త ఊరయి ఊరు కుంది కదా. ఇంత రైటుగా చేసిన సత్యం మీద, ఈ భద్రయ్యా పోటీయా ? చూస్తానుగా...

అంజ : రోడ్లకు రబ్బిష్ వేయించాడు. కంకర వేయించాలని ప్రయత్నం చేస్తున్నాడు. కరెంటు రానే వచ్చింది. రేడియో కూడా వచ్చేసింది. మనకీ సౌకర్యాలు కలిగాయంటే గ్రామంలో పంచాయతీ ఏర్పడడం చేతనే కదా ! రెవిన్యూ సెస్సులు, రిజిస్ట్రేషన్ సర్చార్జి,

చేపల వేలం సొమ్ము వీటి నన్నింటినీ ప్రభుత్వం పంచా యతీలకు ఇస్తున్నది కాబట్టి యీ సౌకర్యాలు కలుగు తున్నై. లేకపోతే, కేవలం మనం ఇళ్లపన్ను, బళ్లపన్నుల వల్లనైతే ఎంత రాబడి వస్తుంది! గడ్డి పాటల మొత్తం కూడా బాగా వచ్చేటట్టు మన ప్రెశిడెంటు రాబడు తున్నాడు. సొంత పనులు మానుకుని గ్రామసేవ చేసే 'సత్యాన్ని' ఇవాళ కాదని, పంచాయతీ వద్దన్న భద్రయ్యే నుంచోడం ఏమీ బాగుండలా.

సత్యం : ఇప్పుడు పంచాయతీ సమితులు వచ్చేసినై కాదూ అందుచేత భద్రయ్యకుకూడా ఈ పదవిపై ఆశకలిగింది.

సారధి : వాటివిషయం విన్నాగాని మనస్సుకు పట్టలేదు. ఏమిటి వాటి విశేషం?

సత్యం : గ్రామస్థుల పూనిక, కృషి మూలంగానే గ్రామాల ఆర్థిక సాంఘిక జీవితాన్ని మార్చాలని ప్రభుత్వ ప్రయ త్నం. అందుచేత మన ప్రజాస్వామ్యాన్ని వికేంద్రీకరణం ద్వారా ప్రజల భౌతిక, నైతిక ప్రతిపత్తి పెంచాలని ప్రభుత్వాశయం. దీనిని సాధించడానికి ఇతోధికాధికారా లను ఇవ్వాలని ప్రభుత్వం నిర్ణయించింది. బహుశా క్రమంగా శిస్తు వసూళ్లు, పన్నులలో వాటాకూడా ఇస్తే ఇవ్వవచ్చు.

సారధి : నే నడిగింది పంచాయతీ సమితుల సంగతి.

సత్యం : దానికే వస్తున్నా. గ్రామీణప్రాంతాలలో వ్యవ సాయం పశుపోషణ మొదలైన ప్రభుత్వకార్యాలను

అనధికారసంస్థలకు - అంటే పంచాయతీ సమితులకు అప్పగించాలని ఆంధ్రప్రదేశ ప్రభుత్వం నిర్ణయించింది.

సారధి : అయితే బ్లాకు కౌన్సిళ్ళు అంటే -

సత్యం : అరవై ఆరువేల జనాభాగల ప్రాంతాన్ని ఒక బ్లాకుగా చేసి, ఆ ఏరియాలో ఉండే పంచాయతీ అధ్యక్షులలో నుండి పంచాయతీ సమితికి, అంటే బ్లాక్ కౌన్సిల్సుకు, ఎన్నికలు జరిపిస్తుంది. దానికొక అధ్యక్షుడు, ఉపాధ్యక్షుడు ఉంటారు. ఇంకా ఒక మహిళ, ఒక వెనుకబడిన జాతుల ప్రతినిధి, ముగ్గురు అనుభవజ్ఞులు కోఆప్టు చేసుకోబడతారు. ఈ సమితి మూడుసంవత్సరాలు అధికారంలో ఉంటుంది. సమితి పని అంతా అయిదు స్థాయీసంఘాల ద్వారా జరుగుతుంది. ఈ అధ్యక్షులలోనుండి జిల్లా పరిషత్తు ఏర్పడుతుంది. దానిలో జిల్లాలోని శాసనసభ్యులు మొదలైన వారుంటారు.

సారధి : అల్లాచెప్పు, ఇదా దీని "కథా, కమామిషు," భద్రయ్య పెద్దచూపులోనే ఉన్నాడు. మనస్సులో 'జిల్లా'కు పోవాలని ఆశ ఉండి ఉంటుంది.

అంజ : జిల్లాబోర్డులు పోతే పోయినై కాని, పంచాయతీ ప్రాతిపదికగా నిర్మింపబడే ఈ సంస్థలు బాగానే పనిచేసే టట్టే ఉన్నాయి.

సత్యం : సారధిగారూ! నా ఆంతర్యాన్ని మనవి చేయడానికి మంచి తరుణం ఇంతకంటె వేరేలేదు. నేను చాలాకాలం నుండి ఈ పంచాయతీలోనుండి వైదొలగవలె నను

కుంటున్నాను. ఎవరైనా క్రొత్తశక్తితో పనిచేసే కుఱ్ఱ వాళ్ళు వస్తే, ఇవాళే వాళ్ళకు దస్తరం అప్పచెబుతా. మీరు పెద్దలుకాబట్టి ఒకవిషయం ఆలోచించండి. ఆ భద్రయ్యరావడం మీకెల్లా ఇష్టంలేదో, నాకూ అల్లాగే ఇష్టంలేదు. ఎవరైనా పనిచేసేవాళ్ళు ఇల్లాంటి సంస్థల లోకి వస్తే బాగుంటుందికాని ఉత్తవాళ్లు వస్తే ఏమీ ప్రయోజనములేదు.

సారథి : సత్యం! నువ్వు నేను చెప్పేదాకా అలా అంటి పెట్టుకు ఉండు. నువ్వు మానివేస్తే ఈ పదవి ఆ 'రావ ణాసురుడి'పాలే పడుతుంది. నిదానంగా ఆలోచించి ఎల్లా వీలయితే అల్లా చేద్దాం. మేమందరం నీమీదే ఆశలు పెట్టుకున్నాం. నువ్వుండడమే నా కిష్టం. నిన్నకాక మొన్న మంత్రిగారు వచ్చి మనగ్రామం ఆదర్శమైన గ్రామం అని చెప్పివెళ్లారు కదా. నీ మూలంగా ఊరి కింత 'పేరూ ప్రతిష్ఠా' వస్తే నువ్వు కాడికొమ్ము క్రింద పారేస్తానంటే, ఈ బండీ ఎవరు లాగుతారూ అంట.

సత్యం : మీరే లాగండి.

సారథి : మెడకాయమీద తలకాయ ఉన్నవాడెవడూ నాకు ఓటివ్వడు. ఒకవేళ మీరు ఫూనుకుని గెలిపించినా నేను జేబులో కాటుకాయి వేసుకొని ఆఫీసుకు వెళ్ళాలి.

అంజ : కాటుకాయ ఎందుకు?

సారథి : ఎందుకేమిటి? 'ఎడమచేతి బొటనవేలి గుర్తు' అని 'నిశానీ' వేయడానికి.

సత్యం : సారధిగారూ! మీరు నిజాయితీపరులు. అక్షరాలు రాకపోతేనేం? మా అమ్మమ్మ వేలసంఖ్యమీద వడ్డీ వ్యాపారం చేసేది. తనదగ్గఱ ప్రామిసరీనోట్లకట్టలో ఎవరెవరి దేనోటో ఇట్టే ఆనవాలుపట్టి తీసియిచ్చేది. మేము కాగితంమీద వడ్డీకట్టడం పూర్తికాకముందే - "మిణి కారులే మీ లెక్కలూ మీరూ" అంటూ నోటితో వడ్డీ చెప్పేసేది. అక్షరమ్ముక్కలు రానివాళ్లు రాజ్యాలు ఏలలా?

సార : చల్లచల్లగా చొప్పిస్తున్నావు కాని - నాకు ప్రెశిడెంటు రాకుండా ఉంటే, ఆ మాచవరం ఆంజనేయ స్వామికి ఒక కొబ్బరికాయ మొక్కుకుంటా. గుమాస్తా నాచేత తప్పుడు చోట్ల వేలిముద్రలు వేయిస్తే ప్రాణం మీదికి వస్తుంది. నువ్వే దానికి తగినవాడవు. పెద్దలలో పెద్దగా, పిన్నలలో పిన్నగా మెలగగలవు.

సత్యం : నాకు మీ సహకారం ఉన్నా, ఉత్సాహానికి తగిన పని చేయలేక పోతున్నాను.

అంజ : సత్యం! మన గ్రామాలన్నీ ఒక్కరోజులో చెడిపోలేదు, ఒక్కరోజులో ఎల్లా కోలుకుంటాయి?

సత్యం : కనుకనే కాళ్లు నిలవత్రొక్కుకుంటూ ఒక్కొక్క మెట్టే ఎక్కితే ఎన్ని అంతస్థుల మేడనైనా ఎక్కవచ్చు. నేలమీద నుంచుని బొటనవేలితో గీట్లుగీస్తూ నుంచుంటే-

సార : ఏముందీ! అక్కడే ఉండిపోతాడు!

అంజ : సత్యం చెప్పినదాంట్లో నిజముంది. అతని పేరే సత్యమాయె. జాతి అనేది ఒక ప్లాను, అంటే 'ప్రణాళిక' వేసుకుని, క్రమంగా ముందుకు పోతూఉండాలి.

నిజానికి పల్లెటూళ్ళలో వ్యవసాయాలు అయినాక పనులేం చస్తై. చీమలు పాకుతే రాళ్లు అరుగుతై. కోట్ల జనం భారతీయులు చిత్తశుద్ధితో పనిచేయడం మొదలిడితే కాని కార్యం ఏముంది ?

సత్యం : అదే నేనూ చెప్పేది. ప్రతి పనికీ పంచాయతీకి డబ్బు ఎక్కడనుంచి వస్తుంది ? పన్నులు వేస్తే, వేసిన వాళ్ళమీదే వేస్తున్నారని గగ్గోలు. తీరుబడిగా ఉన్నప్పుడు ఒకళ్లు బండి సాయం, ఒకళ్లు శరీరకష్టం - ఈ విధంగా పనిచేసుకోవచ్చు సమష్టిగా.

అంజ : సత్యం ! మన చెఱువు కొమ్ము దగ్గఱనుండి ఊళ్లోకి రోడ్డు సంగతి ఏం చేశావు ?

సత్యం : మంజూరయింది. ప్రభుత్వం సగం ఇస్తుంది, పంచాయతీ నాల్గవ వంతు భరిస్తుంది. నాల్గవ వంతు గ్రామం భరించాలి. డబ్బయినా ఇవ్వవచ్చు, శ్రమదానం అయినా చేయవచ్చు. ఈ అవకాశాన్ని వినియోగించుకోలేకపోతే మన జీవితంలో అంత రోడ్డును నిర్మించడం కష్టం.

సార : ఎవరికి వీలయిన సాయం వారు చేయవచ్చు. రాముల వారు వారధి కట్టేటప్పుడు ఉడుత తోకతో ఇసుక తీసుకువచ్చి దులిపేదట !

అంజ : వానరసైన్యం గొప్పపని చేసింది వారధి నిర్మాణంలో.

సార : అంజయ్యన్నా! ఆనాడు సత్యం అహింసా సాధనాలతో తెల్లవాళ్ళమీద ఎల్లా యుద్ధం చేశావో, అల్లాగే దారిద్ర్యంమీద ఇవాళ నువ్వు యుద్ధానికి దిగు. మేం అందరం నీకు వానరసైన్యం క్రిందే ఉంటాము.

అంజ : సైన్యంలో ఒకడవుగా ఉండడం ఎందుకు నీవు తమ్ముడూ, ఈ అభ్యుదయ రథానికి సారథిగానే ఉండు.

సత్యం : అసలు గ్రామం ఎన్నోరకాలుగా చెడిపోయింది. బస్తీ నాగరకతా వ్యామోహంలో పడి పల్లెప్రజలు డబ్బు దుబారా చేసేస్తున్నారు. సహకార సంఘా లనేవి నిజానికి ఎంతో ఉత్తమమైన వ్యవస్థలు కదా! వ్యవసాయం పేరుచెప్పి వానిలో అప్పుతీసుకుని తమతమ విలాసపుఖర్చులకు ప్రజ లుపయోగిస్తున్నారంటే ప్రజలలో ఎంత నీతి తగ్గిపోయిందో తెలుస్తుంది.

రామం : ఈ మధ్య మన రేడియోలో పొదుపును గురించి ఉపన్యాసం వచ్చింది నాన్నా.

అంజ : మనదేశంలో అధికంగా ఉత్పత్తిచేసి, డాలర్లు విదేశాలనుండి తెచ్చుకునే ప్రయత్నం మంచిదే. కాని ఉన్న సొమ్మును దుర్వినియోగం చేయకుండా పొదుపు చేసుకునే కార్యక్రమం అంతకంటె ఎక్కువ విలువకలది. మన ఊళ్ళో కొందరు కుట్టువాళ్లు, దగ్గర బస్తీలకు కాఫీకోసం పోయి, అక్కడ సిగరెట్లుకూడా తగలేసి, అన్నంవేళకు

ఇంటికొస్తున్నారని వింటూంటే ఇంతకంటె గ్రామానికి పతనం అంటూ వేరే ఉందా అనిపిస్తుంది!

సార : సరిసరి! అంజయ్యన్నా! నువ్వింక వినలా – మా యింటిప్రక్క పానకాలుకొడుకు 'టీకాలు' లేడూ–

అంజ : పానకాలు కొడుకుపేరు టీకాలా? ఆ పేరెందుకు పెట్టారు చెప్మా!

సత్యం : బిడ్డలు బ్రతకపోతూ ఉంటే, ఏదో పిచ్చిపేరుతోనైనా ఆ 'నలుసు' బ్రతికితే చాలని, తల్లిదండ్రులు ఆ పేరుతో పిల్చేవారు. తర్వాత ఊరందరికీ అదే పేరయింది. ఈమధ్య వాడయితే లెక్కల్లో 'టేకారావు' అని మార్చుకున్నాడుకాని ఆ పేరుతో వాడిని ఎవరూ పిలవరు.

సారథి : వాడు సాయంత్రం అయే సరికి పదో, ఇరవయ్యో, జేబులో వేసుకుని, డాబుగా వేషం వేసుకుని బస్సుమీద బస్తీకి చేరుతాడు. సినిమాలు చూస్తాడు. ఆ బస్తీల్లోనే హోటళ్లలో మేడలమీద రూము లిస్తారుట! రూములు! పొరుగూరివారికి సౌకర్యం కల్పించడానికి. అందులో చేరుతాడు. అక్కడగాని వాడికి సుఖంగా నిద్దరపట్టదట! తెల్లవారి మళ్ళీ కాఫీత్రాగి ఇంటికి వస్తాడు. ఇల్లా అద్దె యిల్లేమో, వాడికి సొంతయిల్లు! సొంతయిల్లేమో అద్దె యిల్లు అయింది. ఇదేం పొయ్యేకాలంరా టీకాలూ అంటే – "మామా! నీకు జీవితంలో అనుభవించడం తెలియదులే" అంటాడు.

అంజ : వాడితండ్రి ఎంత ఒబ్బిడిగా సంసారం చేశాడో తెలుసా ? దొడ్లో బాదమాకులు కోసుకుని విస్తళ్లు కుట్టుకునేవాడు. తన బట్టలకు నూలు తానే వడుక్కునేవాడు. తనదొడ్లో కాసిన కూరలు తప్ప తినేవాడు కాదు. ఎప్పుడూ ఇంట్లో కవ్వం కట్టడమంటూ లేదు. పాడి తానను భవించేవాడు ఇరుగుకూ పొరుగుకూ పోసేవాడు.

సారధి : ఇంతేనా ! తెల్లవారి లేస్తే ఎప్పుడూ పొలంలోనే ఉండేవాడు. ఏయేటి కా యేడు మెరకా పల్లం సమానం చేసేవాడు. అల్లా అద్దమల్లే పొలాన్ని చేస్తే, ఇక చౌడెక్కడ మెక్కడిదీ ! ఎకరానికి పాతికబస్తాలకు తక్కువకాకుండా పండేది. పచ్చిరొట్టనీ, పాటి మట్టినీ పడేస్తూ ఉండేవాడు.

(రాధ ప్రవేశం)

రాధ : ఎవరిసంగతి బాబాయీ! పానకాలుగారి సంగతేనా?

సార : అవునమ్మా !

రాధ : వాళ్లది నిజానికి వట్టి పూరిల్లేనా – పానకాలుగారుండగా ఆ యిల్లు ఎంతో కళకళలాడుతూ ఉండేది. మహాలక్ష్మికళ ఉట్టిపడుతూ ఉండేది. ఆవిడ పాటిమన్నూ గోమయం, ఇసుక, కలిపి గచ్చులా అలికేసేది నేలను. ముగ్గు పెడితే 'జామెట్రీ' కొలతల ప్రకారం కచ్చితంగా ఉండేవి ఆ రేఖలు. మంచి లక్షణంకల ఆవు లెన్నో ఉండేవి వాళ్ళకు.

సార : మంచి కుదిరెంగల ఆవులు బుల్లీ ! అతను సిసలైన రైతుబిడ్డ. గోమాతనూ భూమాతనూ నమ్ముకున్నాడు.

ఏటా ఒక కోడెదూడ అక్కడికు వచ్చేది. 'పశుధనం' అంటే అదే బుల్లీ! మాగానిలో రెండవ పంట తీసివేసింది మొదలు, తొలకరించేదాకా పొలంలోనే పశువులను కట్టేసేవాడు. చేను ఎకరానికి 'పాతిక' విసిరిందీ అంటే ఏమీ ఆశ్చర్యపడాలసిన పనిలేదు.

అంజ : అయిదెకరాలవాడు యాభై ఎకరాలవాడు ఎల్లా అయాడు? పొలంలో ఎరువువేయడం అంటే, బాంకులో డబ్బు దాచుకోవడమన్నమాట. మనం చేసిన పనినిబట్టే మనకు ఫలితం ఉంటుంది. మనం పొలంవంక చూడక పోతే పొలమూ మనవంక చూడదు.

సార : బాగుచేసుకోనివాళ్లకు పొలం ఎందుకయ్యా? పొలం లేనివాడు లేదో అని ఏడుస్తుంటే, బాగుచేసుకోలేని వాళ్ళు పొలాన్నిచూసి, ఏడుస్తూ, అల్లాగే దాన్ని అంటి పెట్టుకు కూర్చున్నారు వేరేదారి తోచక. పానకాలు 'బహు పసంద'యిన మనిషిలే! "బావా! నీ నాగళ్ళు ఇవాళ నాకు రానీ, రేపు నా నాగళ్ళు నీకు వచ్చి ఒక గీతగీసి పోతై" అనేవాడు. వ్యవసాయంలో మా ఇద్దఱికీ సహకారం అల్లా ఉండేది.

అంజ : యాభై ఎకరాల్లో నలభై మంగళం పాడాడు టీకాలు.

సత్యం : ప్రస్తావనలో మనకు 'టీకాలు' తగిలాడుకాని ఇల్లాంటి వాళ్ళెందరో ఉన్నారు. వాళ్ళు కళ్లు తెరవందే పల్లెలకు మోక్షంలేదు. కష్టపడినవాళ్ళకు డబ్బు విలువ

తెలిసినట్లు వాళ్ళ కెల్లా తెలుస్తుంది? అల్లా 'పైలాపచ్చీసు'గా ఆడేవారే సంఘానికి చీడపురుగులు. ఇలాంటి వాళ్ళను మనం సక్రమమైన దారిలో పెట్టకపోతే వీళ్ళను చూసి మరికొందరు చెడిపోతారు.

సార : అవును. గ్రామం అంటే ఇల్లాంటి వాళ్ళుకూడా ఉన్నదేకదా! గ్రామంలో వ్యక్తులు బాగుపడితేనే గ్రామం బాగుపడ్డట్టు.

అంజ : అలాంటివాళ్ళను పొదుపుగా వ్యవహరించేటట్లు చేసి, ప్రభుత్వ ఋణపత్రాలు కొనిపిస్తే, ఆ ద్రవ్యంవల్ల అనేక దేశాభ్యుదయ కార్యక్రమాలు అమలుజరుగుతై. అంతే కాదు. మన సహకారసంఘాలు కూడా బాగా పని చేయాలి. ఏ ఒక్కవ్యక్తి విడిగా సాధింపలేని పని సంఘాలు సాధిస్తై. అదునులో కావలసిన వస్తువులు తగు మాత్రం ధరలలో మన కందటానికి ఈ సంఘాలు ఎంతో ఉపయోగిస్తై. అదునులో అప్పు ఇవ్వక కొందరు, ప్రక్కవాడి ఆస్తిని ఎక్కువవడ్డీకి అప్పుఇచ్చి, తాకట్టు వ్రాయించుకు, వాకట్టు చేయాలనుకుంటారు క్రూరంగా. ముఖ్యంగా వ్యవసాయతరుణంలో, ఖర్చులకు, ఈసంఘాలు తక్కువ వడ్డీతో ఋణం ఇవ్వడం, మళ్ళీ పంటల్లో తీసుకోవడం ఎంత బాగుంది?

సత్యం : నిజమే అన్నా - నేను గ్రామానికి వ్యక్తులను సత్పథంలో పెట్టే పథకం అమలు జరుపలేక పోతున్నాను. కాని మన జీవితాలను ఈ సత్కార్యానికి అంకితం చేయ

వలసిన అవసరం ఉంది. అంత మాత్రంలో రోడ్ల పధ
కాలు మానుకో అక్కర లేదు.

అంజ : బాగుంది, సత్యం!

సారధి : నేను మీతోపాటు సిద్ధమే. ఇందాక చెప్పిన చెఱువు
కొమ్మ రోడ్డుకు ప్రజల సహకారంకోసం ఇప్పుడే బయలు
దేరుదాం. మన చందాలు మనం, ముందుగా ఇచ్చేద్దాం.
ఊళ్లో శ్రామికులను తలో చెయ్యి వెయ్యమని ప్రతి
మాలుదాం. మనం ముందు తట్ట ఎత్తుకుంటే, ఊళ్లో
వాళ్ళందరూ చూస్తూ ఊరుకుంటారా? ప్రజలందరూ
రాతిగుండె కలవారు కారు. ప్రజలలోనే నిజంగా లోపం
ఉంటే, వెనుకటి జాతీయోద్యమాలన్నీ ఎల్లా నడిచాయి?

అంజ : నిజం, నిజం.

రామం : నాకు ప్రణాళికా గీతాలు వచ్చు నాన్నా! నేనూ
మీతో వస్తా, పాడుకుంటూ.

సార : ఫస్టు, ఫస్టు. వెనకటి ఉద్యమాలలో కూడా ఇల్లాగే
అందరూ వచ్చి పూనుకునేవారు. రామం! నీ వాక్కు
గీతం పాడు. నేను కదిలానంటావా – నీ గీతానికి ప్రజలు
కదిలినట్లు. లేకపోతే ఆ పాటకంటె మా మాటలే
మెఱుగు.

రామం : లేవరా లేవరా
లేచి రారా
పల్లెపట్టు వాడ! ఓ
భారతీయుడా!

గుండు దెబ్బ కెదు రొడ్డీ
గుండె నీయ పని లేదూ
లాఠీలకు తను విచ్చే
మాటయె లేనే లేమా॥

రాచరికం వచ్చిందీ
రాజువు నీవేరా !
నీ ఇల్లే నీ రాజ్యం
నీ చేతనె ఉన్నదిరా.

నీ పూచీ నీ వెఱిగిన
నీ పల్లెకు నిచ్చేచీ –
భారత దేశమ్మంతా
బంగారం పండేరా.

లేవరా లేవరా
లేచి రారా.

సార : కొద్దిగా కదిలేను. ఈపట్టు ఇంకో పాట పాడు.

రామం : నేతలం – ని
ర్ణేతలం

మనజాతికి మనమే
నేతలం నిర్ణేతలం ॥

కాయ మనదీ, కొడవలి మనదీ
గాయ పడినా కార్యం మనదీ ॥

జాతి మతాల విచక్షణలేనీ
మానవ న్యాయం మన సూత్రం;
సమానావకాశాల సృజించే
ప్రజాస్వామ్యమే మన లక్ష్యం ॥

ఒకటీ రెండూ మూడూ నాలుగు
ఎన్ని ప్రణాళిక లై తేనేం
దారిద్ర్యానికి గోరీ కడతాం
ధర్మరాజ్యమే స్థాపిస్తాం

నేతలం – నిర్ణేతలం
మన జాతికి మనమే
నేతలం నిర్ణేతలం ॥

సార : (ఊగిపోతాడు)

రాధ : (నవ్వుతూ) బాబాయీ, ఊగిపోతున్నావు, (రామంతో) రామం! నువ్వు పరీక్షలో ప్యాసయ్యావు.

సత్యం : ఎంతో బాగుంది. మేము ఇందాకటినుంచీ మథన పడిందంతా ఒక్క—పాటలో వచ్చేసింది. నవసమాజాన్ని నిర్మించడం మన లక్ష్యం. మన ఊహ అంతా ఇందులో ముద్దకట్టింది. మన సారధిగారుకూడా ఊగిపోయారు.

సార : ఎప్పుడు నేర్చుకున్నావోయి ఈ పాట ? బుల్లెమ్మకు కూడా ఇల్లాంటి పాటలు వచ్చునా ? మీరిద్దరూ కలిసి పాడుతూ ముందు నడుస్తూ ఉంటే మేము వెనుక నడుస్తాం.

రామం : మా అక్కకు కూడా వచ్చు.

సార : అయితే మీ రిద్దరూ కలిసి ఒకపాట పాడండి. ఇప్పుడే పదయాత్ర సాగిద్దాం.

రాధ }
రామం } నిద్దుర పుచ్చీ వెడుతుందా
ముద్దా కలిపీ పెడుతుందా
ప్రభుత్వమంటే ఎవరండీ
ప్రజలూ మీరేకద సుండీ.

తక్షణమే ఫలియిస్తాయా
లక్షలాది మన కోరికలూ
కాదని లేదని అంటారా
కళ్ళేం మీరే పట్టండి.

పరికరమ్ములే ఇస్తారో
మరి మరి, ధనమే ఇస్తారో
నెఱవేరును మీ పనులన్నీ
అరభాగం మీరి స్తేను.

కాదని లేదని అంటారా
కాయ కష్టమే చేయండీ
కండలు కరగీ పోవండీ – మీ
కొండలు తరగీ పోవండీ.

స్వతంత్ర భారత రాజ్యంకోసం
సర్వత్యాగం చేశారూ;
స్వతంత్ర భారత రాజ్యంలోనే
శ్రమించలేరా ఈ పాటి.

నిద్దురపుచ్చి పెడుతుందా
ముద్దా కలిపి పెడుతుందా
ప్రభుత్వమంటే ఎవరండీ
ప్రజలూ మీరే కద సుండీ.

జై! స్వతంత్రభారత్‌కు జై!

అంజ : ప్రజల దగ్గరకు వెడదాం. పదండి.



# షష్ఠాంకము

(రామం, రాధ)

రాధ : నిన్న ఊరేగింపు బాగా జరిగిందికాదూ

రామం : బాగన్న బాగా ! మోతగా జరిగింది

రాధ : మోత ఏమిటిరా, నీ మొహం ?

రామం : 'మోత' అంటే ఇప్పటి ప్రజలభాషలో చాలా బాగుండడం అన్నమాట. అయినా ఊరేగింపులో మోత ఉంటుందిగా.

రాధ : అయితే – మురళీ, చక్రంకూడా వచ్చి పాల్గొన్నారే-

రామం : వాళ్లు గ్రామం క్షేమం కోరినవారే ! అక్కా, చిక్కేమంటే వారు భద్రయ్య కొడుకులు.

రాధ : సరే – గ్రామానికి వాళ్లు మంచివాళ్లే కాని, అసలు, ఇద్దరిలో ఎవరు మంచివారురా ?

రామం : నాకేం తెలుసు! నాకంటె పెద్దదానవు, వాళ్లతో కలిసి చదువుకున్నదానవు నీకు తెలియాలి.

రాధ : నేను చక్రంతో చిన్నప్పుడు చదువుకున్నా. మురళితో చదువుకోలేదు. నేను చదివేటప్పుడు మురళి పై క్లాసుల్లో ఉండేవాడు. ఎప్పుడో చిన్నప్పటి విషయం ఎందుకు ? ఇప్పుడు నువ్వు చూస్తూనే ఉన్నావుగా.

రామం : నువ్వూ చూస్తూనే ఉన్నావుగా !

రాధ : (విసుగుతో మూతి ముడుచుకుని) పోనీలే అమ్మా! నేనూ నీ ప్రశ్నలకు ఇకనుంచి అల్లాగే సమాధానం చెబుతాలే.

రామం : అదికాదే అక్కా - చక్రం మంచివాడే!

రాధ : మరి మురళి ?

రామం : మురళి (తలగోక్కుని నవ్వుతూ) అంతకన్నా మంచివాడు.

రాధ : చక్రంకన్న మురళి ఎందుచేత మంచివాడురా రామం ?

రామం : మురళికన్న చక్రమే మంచివాడే.

రాధ : ఓరి భడవా! మతిపోయిందా ఏమిటిరా, చదువు కూడా ఇల్లాగే అఘోరిస్తున్నావా ఏమిటి ?

రామం : నాకు చదువులో చక్రం సంగతి మురళి సంగతి చెప్పరే. అయినా అక్కా! నాకు తెలియక అడుగుతాను, 'నా' కెందుకు మతిపోయిందే ?

రాధ : మరి నాకు పోయిందంటావా ?

రామం : (పెదవి విఱచి) మతిపోవడం కాకపోతే - చక్రం మంచివాడయితే నీకేం, మురళి మంచివాడయితే నీకేం? అయినా వాళ్లకు మన సర్టిఫికెట్ ఎందుకే ?

రాధ : (కోపంతో మాట్లాడదు)

రామం : నీకు కోపం ముక్కున ఉంటుంది. చెబుతా విను అక్కా! ఇద్దరూ మంచివాళ్లే కాని అందులో మురళి ఇంకాస్త మంచివాడే!

రాధ : (వికాసంతో) ఎందుచేత ?

రామం : ఎందుచేత ? (బుర్ర గోక్కుంటూ) ఎందుచేత చెప్మా (ఆగి) తోచడంలేదే అక్కా

రాధ : పో ! కొంటె కోణంగి !

రామం : ఇప్పుడు తోచింది. నీవు తిట్టిన తర్వాత. ఎందుచేత నంటావా, మురళి మనలో కలిసిపోయే మనిషే.

రాధ : అంతే నంటావా !

రామం : తప్పకుండా, అంతేనే –

రాధ : మరి, చక్రంకూడా మనలో కలిసిపోయి ఎంతో చనువుగా మాట్లాడు తున్నవాడేగా.

రామం : (నెమ్మదిగా) చచ్చాం ! (బిగ్గరగా) మాట్లాడుతూ ఉన్నా ...

రాధ : ఉ ! మాట్లాడుతూ ఉన్నా ...

రామం : మధ్యమధ్య తాను భాగ్యవంతుల బిడ్డ ననే 'టెక్కు' చూపిస్తాడే – 'టెక్కు !'

రాధ : మురళి అసలు ఎక్కువగా మాట్లాడడుగా. అతను మంచివాడో కాడో ఎట్లా తెలుసు ?

రామం : తెలియకేం ? నీకు పుట్టిన రోజు పండుగనాడు కొండపల్లి బొమ్మ ఇచ్చాడుగా.

రాధ : ఇస్తే–

రామం : ఒక్కమాట చెబుతా విను.

రాధ : ఏమిటిరా అది ?

రామం : మొన్న నేను కళాపూర్ణోదయంలో సుగాత్రీ శాలీనుల కధ చదివానే.

రాధ : ఏమిటిరా ! పిట్ట కథలలోకి దిగావు ?

రామం : సుగాత్రీ శాలీనులు భార్యాభర్తలే.

రాధ : అయితే -

రామం : భర్తను సంతోష పెట్టడానికి శాలీనుడు, ఆభరణాలు

రాధ : (నవ్వుతూ) ఏమిటేమిటీ! శాలీనుడు భార్య సుగాత్రి భర్తా ఏమిటి ?

రామం : కాదే అక్కా ! సుగాత్రి ఆభరణాలు పెట్టుకు వెడితే, మొట్టమొదటి రోజునే భర్త ఆమెవంక చూడ లేదుటే.

రాధ : ఊ.

రామం : ఎన్నాళ్ళకూ తనవంకకు చూడక పోయేటప్పటికి ఆమె ఖిన్నురాలయింది. ఆభరణాలన్నీ తీసివేసి ఒక రోజున భర్త తోటపనిచేస్తూ ఉంటే భర్తకు సహాయం చేసిందటే -

రాధ : ఊఁ !

రామం : ఆ రోజున భర్త ఆదరించాడే

రాధ : ఊఁ !

రామం : ఆదరించాడు కదా అని మళ్ళీ మరురోజున ఆభరణాలు పెట్టుకువెళ్లిందే-

రాధ : ఊఁ

రామం : వెడితే ఏముందీ - మళ్లీ యథాప్రకారం. భర్తకు కృత్రిమ సౌందర్యం ఇష్టం లేదని అప్పుడు తెలుసుకుంది.

రాధ : ఊ!

రామం : కథ కంచికెళ్లింది - మనం ఇంటికొచ్చేశాం.

రాధ : ఎందుకు చెప్పినట్లూ యీ కథ?

రామం : ఎందుకంటే, చక్రం దగ్గర ఆడంబరం ఉన్నదనీ మురళి సహజమైన మనిషనీ, అందుచేత మురళి నాకు నచ్చుతాడనీ

రాధ : అల్లాగా!

రామం : 'నా'కంటే అర్థం తెలుసా? నాకు కాదు నీకని

రాధ : చాల్చాల్లే! వీపు చిట్లగలదు!

రామం : నా వీపు చిట్లడం దేనికమ్మా? మీ ఇద్దఱూ మంచివాళ్లే. నువ్వు ఆయనసంగతి అడుగుతావు, ఆయన నీ సంగతి అడుగుతాడు.

రాధ : (ఆసక్తితో) నా సంగతి ఆయన ఎప్పు డడిగాడురా?

రామం : అనేకసార్లు

రామ : ఏమని అడిగాడురా?

రామం : రాధ కులాసాగా ఉంటోందా? అని

రాధ : నువ్వేం చెప్పేవాడివి?

రామం : నువ్వు కులాసాగా లేవని ఎల్లా చెప్పను?

రాధ : ఏమిటిరా వంకర మాటలు! సరే - కులాసాగానే ఉన్నదని చెప్పేవాడివి -

రామం : అల్లా చెబితే - ఇక వీడు "రామం" ఏమిటి! "ఏదో, అల్లా అల్లా ఉందండీ, ఇంట్లో పనంతా ఒక్కర్తే

చేసుకోవాలి కదా. మఱచిపోయాను. మీ రసలు రావడమే లేదని అనుకుంటూ ఉంటుందండి" అని అనేవాడిని.

రాధ : ఓరి కొరివీ! నే నెప్పుడయినా నీతో అన్నానుటరా?

రామం : నాతో నువ్వు అన్నావని చెప్పానా ఏమిటి? నువ్వు మనస్సులో అనుకుంటున్నావని నేను అనుకుని ఆయనతో చెప్పాను. కాకపోతే పోనీ -

రాధ : పోనీలే - దాని కాయన ఏమనేవాడు?

రామం : ఏమనేవాడూ, తెల్లబోయేవాడు.

రాధ : (తెల్లపోతుంది)

రామం : అదేమిటక్కా! ఆయన తెల్లపోయేవాడని చెబితే నువ్వు తెల్లపోతావేమిటి?

రాధ : నోరు మూయరా. నీకు వాగు డెక్కు వయింది!

రామం : (నోరు మూసుకుంటాడు)

రాధ (చిరునవ్వుతో) నోటిమీద చెయ్యి తీస్తావా, వీపుమీద అట్లు తిరగెయ్యమంటావా?

రామం : అంజయ్యగారు ఇంట్లో ఉన్నప్పుడు ఒకమాటు రావాలి అనేవాడు.

రాధ : (ఆలోచిస్తూ ఊరుకుంటుంది)

రామం : అక్కా! భద్రయ్య ఆస్తి వదిలేసి మనిషిగా చక్రం, మురళి, బైటకొస్తే - చక్రం ఎండిన చెఱువులో చేపల్లే బైట పడిపోతాడు. మురళి అంటేనో, ఏటి కెదురీదుకొస్తాడు. అందుకని మురళి అంటే నా కిష్టమే.

రాధ : (నవ్వి) నాన్న మాట్లాడినట్లు మాట్లాడుతున్నావే!

(అంజయ్యగారూ! అని మురళి కేక)

రామం : ఉన్నారు. రండి కూర్చోండి. అక్కయ్యా! మురళి గారికి కాస్త దాహం ఇవ్వవే. పాపం! చాలాకాల మయింది మనింటికొచ్చి (అని బయటకు వెళ్లిపోతాడు)

(రాధ లోపలకు వెళ్లి మజ్జిగ తెచ్చి యిస్తుంది)

మురళి : (త్రాగి) రాధా! మీ నాన్నగారు లోపల ఉన్నారా?

రాధ : ఊళ్ళో లేరు.

మురళి : ఉన్నారని చెప్పాడే రామం!!

రాధ : కొంటెతనం ఈమధ్య మరీ ఎక్కువయింది.

మురళి : చాలకాల మయింది నిన్ను చూసి –

రాధ : (నెమ్మదిగా) అవునండీ!

మురళి : క్రొత్తమర్యాద వచ్చిందే!

రాధ : ఏమోనండీ, ఝరాలున అల్లావచ్చింది!

మురళి : మళ్ళీ, అల్లాగే 'అండీ' అంటావు!

రాధ : ఈ మధ్య మిమ్మల్ని వెనుక పిలచే అలవాటు తప్పిపోయిందండీ!

మురళి : అవునులే. పెళ్లికాని పిల్లవు. తండ్రిచాటు దానవు. అంత చొరవగా కూడా పిలవడం మంచిదికాదులే.

రాధ : (సిగ్గుపడి) క్షమించండి.

మురళి : వెళ్లివస్తా రాధా!

రాధ : ఇంకొక గ్లాసు మజ్జిగ ఇస్తా త్రాగివెళ్ళండి.

మురళి : ఇస్తానంటే వద్దని ఎల్లా అంటాను ?

రాధ : (మరొకగ్లాసు మజ్జిగ తెచ్చియివ్వగా మురళి త్రాగుతాడు)

మురళి : చాలా రుచిగా ఉన్నై. 'ఈ' మజ్జిగకు - కాదు, 'మీ' మజ్జిగకు కృతజ్ఞుణ్ణి.

రాధ : (విచిత్రమైన అనుభూతితో) నమస్తే.

(మురళి వెళ్లిపోతాడు. రామం ప్రవేశిస్తాడు)

రామం : అక్కయ్యా ! ఒక్క సంగతి చెప్పడం మరచి పోయాను.

రాధ : (విసుగుతో) ఏమిటిరా - ఆ మఱచిపోయింది ?

రామం : అంత విసుగుతో ఉన్నవాళ్లకు చెప్పకపోతే ఏంలే

రాధ : విసిగించబోకురా !

రామం : ఆ! ఏమీలేదు "మీ అక్కయ్యకు మీ నాన్న గారు ఎక్కడయినా సంబంధాలు చూస్తున్నారా ?" అని అడిగారే మురళిగారు.

రాధ : (ఆసక్తితో) నువ్వేం చెప్పావు? (ఆగి) ఏదో అబద్ధమే చెప్పి ఉంటావులే! ఇందాక చెప్పలా అబద్ధం! 'నాన్నగా రింట్లో ఉన్నారని'.

రామం : అల్లా నేను చెప్పకపోతే మురళిగారు మన ఇంటి కిప్పుడు వచ్చేవారేనా ?

రాధ : రాకపోతే ఏం?

రామం : ఇప్పుడు నేను ఏం సమాధానం చెప్పానో చెప్పక పోతే ఏం?

రాధ : (బుజ్జగిస్తూ) నువ్వేం చెప్పావురా ?

రామం : "కట్నాలు తీసుకోకూడదని బిల్లు ప్యాసయినా మనుష్యులకు వివేకం కలుగలేదు. అల్లా కట్నం తీసుకునే వాళ్ళకు పిల్లనివ్వకూడదని మా నాన్నగారి ప్రతిజ్ఞ - అని అన్నా.

రాధ : దాని కాయన ఏమన్నాడురా !

రామం : ఆయన ఎవరే - ఎవరి ఆయనే ?

రాధ : (నవ్వు ఆపుకుంటూ) ఓరి తుంటరీ !

రామం : "ఆ పిల్లను చేసుకునేవాడికి ఆ అమ్మాయే కట్నం" అని అన్నారే మురళిగారు.

రాధ : అబద్ధం

రామం : సత్యం

రాధ : అబద్ధం

రామం : సత్యం

రాధ : అబద్ధం అబద్ధం అబద్ధం

రామం : సత్యం సత్యం సత్యం

(సత్యం ప్రవేశం, రాధ నిష్క్రమణం)

సత్యం : నా పేరు తలుస్తున్నారేమిటి ?

రామం : ఆ! ఏమీలేదు. మీరు గెలవడం సత్యం, భద్రయ్య ఓడడం సత్యం.

సత్యం : ఏమో - డబ్బు పరుస్తానంటున్నాడుట !
రామం : పరవనీయండి సత్యంగారూ ! పోనీ, మీ ధర్మమా అని ఆయనదగ్గఱ డబ్బు వదిలిపోతుంది. ఓటర్లకూ లాభం కలుగుతుంది.
సత్యం : కుఱ్ఱవాళ్ల ఊహలు ఇల్లాగే ఉంటాయి.
రామం : పోనీ - ఆయనదగ్గఱ డబ్బు తీసుకుని ఓటు మీ పార్టీకి వేస్తారు. పారిజాత వృక్షం ఒకచోట - పూలు ఇంకొకచోటా.
సత్యం : అది మరీ నైతికపతనం. అల్లాంటి ఉపకారం పొందడంకంటె పోటీ మానివేయడమే మంచిది !

(సారధి, అంజయ్య ప్రవేశం)

సారధి : ఏమిటి సత్యం ! అంజయ్యన్న ఊరు వెళ్లి వచ్చేటప్పటికి పోటీ విరమించుకోవడం మంచిదంటున్నావేమిటి ?
సత్యం : అవునండీ ! కథ అడ్డంగా తిరిగింది. అసలు నాకు పదవిమీాద వాంఛ లేదని మీకు తెలుసు. ఏదో అల్లాగే అంటిపెట్టుకుని ఉండమంటే పోనీ ఉందామనుకున్నాను మరొకరు వచ్చేదాకా. చెఱువుకొమ్మురోడ్డు కూడా, మీ అందరి సహకారం వల్లా పోషించానా. ఇంత ఉపకారం గ్రామానికి చేసినా మన ప్రజలకు కొందరికి భద్రయ్య డబ్బుముఖం చూపేసరికి 'పెరపెర'లాడుతోంది.
డబ్బుతో కొందరు ఉపనాయకులను కట్టేశాడు. వాళ్లు 'మోహాళా'గా డబ్బుతిని, రోజూ డబ్బు తీసుకెళ్లి ప్రజలమీాద పడుతున్నారు కొనెయ్యడానికి,

అంజ : ప్రజలందరూ డబ్బు కాశపడతారా!

సత్యం : కొందఱు పుచ్చుకున్నారు. కొందరు మొహానవేసి కొడుతున్నారు పుచ్చుకోకుండా. కొందరు ఇంకా "పుచ్చుకుందామా వద్దా" అని ఊగిసలాడుతున్నారు. ఈ పంచాయతీ ఎన్నికలు చాలా అసహ్యంగా ఉన్నై. కొందఱు నా దగ్గఱకువచ్చి "ఆ డబ్బుచూస్తే మేము ఆగలేకుండా ఉన్నామండి. ఏ క్షణంలోనైనా మేము లోబడి పోవచ్చు. మీమీద మాకు అభిమానం ఉంది. మా ఓట్లు మీరు వేయించుకో దలచుకుంటే, మమ్మల్నందరినీ ఒక దొడ్లో పెట్టుకుని తాళం వేసుకుని ఓట్ల రోజున మాత్రం వదలండి. మీకే వేస్తాం ఓట్లు. డబ్బు ఆ విధంగా తాండవమాడుతూ ఉంటే మేము చూస్తూ నిబ్బరంగా ఉండలేకపోతున్నాము. మమ్మల్ని మీరు యీ తప్పుడుపని చేయకుండా కాపాడండి" అంటున్నారు.

అంజ : అల్లా దొడ్లో పెట్టడంకూడా తప్పేకదా!

సత్యం : "నెయ్యాన్నం తినే మహారాజులే ఇల్లా డబ్బు పఱచి తల్లికీ బిడ్డకూ కాకుండా చేస్తూఉంటే, 'గాలివాళ్లం' మేం ఎంతకాలం నిజాయితీగా ఉండగలం" అంటున్నారు. నాకు మతిపోతోంది.

సారధి : ఇక ఆపు సత్యం "అర్జున విషాదయోగం". చూశావా, అంజయ్యన్నా! ప్రజలకు ఏరోజు ఉపకారం చేస్తే ఆరోజే. మరురోజు కది పరగడుపు. అయితే కొందరు నిజాయితీగా ఉండేవారూ ఉన్నారనుకో-

సత్యం : "మేము ఈపని చేశాం ఆపని చేశాం" అని 'బాకా' లూదడం నాకు కష్టంగానే ఉంది. అల్లా చెప్పినా "ఈయన సొంత డబ్బెట్టి చేశాడా? ప్రజల డబ్బేకదా! ఆ మాత్రం మేమూచేస్తాం అధికారంలోకి వస్తే" అని అంటున్నారట భద్రయ్య మనుష్యులు.

అంజ : చూడు సత్యం! ప్రజలందరూ ఒకరకంగా ఉండరు. అధికారంలో ఉన్నవారు చేసిన మంచిపనులను కూడా తప్పులనేవారూ ఉంటారు. అధికారంలో ఉన్నవాళ్ళను తప్పుపని చేయించడానికి ప్రయత్నించి వారంగీకరించక పోతే, అందుకోసమే వారు విరోధులై కూర్చున్నవారు మొదటిశత్రువులు. వాళ్లు సున్నాలలాంటి . వాళ్లు. అధికారవర్గానికి వ్యతిరేకంగా నిలబడడానికి ఎవరైనా ఒకమనిషి ప్రయత్నిస్తే, ఆ ఒకటిప్రక్క చేరుతై యీ సున్నాలన్నీ.

సత్యం : అయితే ఇల్లాంటి ఎన్నికలు లేకపోతే ఏం?

అంజ : మనలో తప్పులున్నవని అసలు ఎన్నికలే వద్దంటే ఎల్లా? వయోజనులందరికీ ఓటుహక్కు మనం ఎల్లా ఏర్పరచుకున్నామో, అల్లాగే జవాబుదారీ తెలుసుకు ప్రవర్తించే పరిస్థితులు మనం కల్పించాలి. పరాయిపాల నాన్ని తరిమివేయడానికి జీవితాలను ఎల్లా అంకితం చేశామో అల్లాగే సుపరిపాలన రావడానికికూడా జీవి తాలను 'అంకితం' చేయాలి. దానికి యువకులు నడుం కట్టవలసిన అవసరం ఎంతయినా ఉంది.

సారథి : యువకులంటే జ్ఞాపకం వచ్చింది. హిరణ్యకశిపు డున్నచోటే ప్రహ్లాదుడూ ఉంటాడు సత్యం! ఒక్కమాటు మురళితో అంజయ్యన్న రమ్మన్నాడని చెప్పిరా.

సత్యం : అల్లాగే (వెళ్ళిపోతాడు)

అంజ : అదేమిటి సారథీ! నేను రమ్మన్నానని మురళికి కబురుచేశావు?

సారథి : వచ్చినతర్వాత గ్రామవిషయం మాట్లాడుదాం. మనకు భద్రయ్య పద్ధతిమీద విరోధం కాని, భద్రయ్య కుటుంబంమీద కాదుగా.

అంజ : అసలు నాకు విరోధు లెవరున్నారు? నేను సత్యాగ్రహిని.

సారథి : మొన్న మురళి, చెఱువుకొమ్మురోడ్డు నిర్మాణానికి చందాలు వసూలుచేసినప్పుడు ఊరేగింపులో పాల్గొన్నాడాయె.

అంజ : ఏమిటి నీ ఊహ?

సారథి : ఏమీలేదు, అన్నా! మన రాధను మన మురళి కెందుకు ఇయ్యకూడదూ?

అంజ : ఇవ్వవచ్చుకాని, ఆ విషయం ఇంతవఱకూ నా మనస్సులోకి రాలేదు. దానికి భద్రయ్య ఒప్పుకుంటాడా? మనం కట్నం ఇవ్వలేము, ఇయ్యముకూడా. అయినా రాధ అభిప్రాయం ముఖ్యం.

సారథి : అమ్మాయి రాధా!

(రాధ లోపలనుండి వస్తుంది)

రాధ : ఎందుకు బాబాయి ?

సారధి : నేను మీ నాన్నలాంటివాణ్ణి. నేను ఒక్కటి అడుగుతా. సిగ్గుపడకుండా సమాధానం చెప్పమ్మా. మురళిని పెళ్ళిచేసుకోవడం నీ కిష్టమేనా ?

రాధ : (సిగ్గుతో) నా కేం తెలుస్తుంది బాబాయి ! నాన్న ఇష్టమే నా యిష్టం.

సారధి : ఆయన, "నీ యిష్టమే ఆయన ఇష్టం" అంటున్నాడు ఎల్లా తేలేది ?

రామం : నేను తేల్చివేస్తా బాబాయి. మా అక్కయ్యకు నూటికి రెండువందలపాళ్లు ఇష్టం.

(అందరూ నవ్వుతారు)

సారధి : అసలు నువ్వే చేసుకునేటట్టే ఉన్నావే రామం – మురళిని !

రామం : అదికాదు బాబాయి. మా అక్కయ్యకూ మురళి గారికీ ఇష్టమే.

సారధి : నీకొడుకు తురుపులాంటివాడు అంజయ్యన్నా !

అంజ : ఏదో – పసివాడు ! వాగుతూ ఉంటాడు. పోరా, లోపలకు పో !

(రామం లోపలకు పోతాడు, కూడా రాధకూడా వెళ్ళి పోతుంది)

సారధి : నేను ఎందుకంటున్నానంటే – ఈమధ్య భద్రయ్య పెళ్లాం మా 'యింటిదాని'తో చెప్పిందిట నన్ను ఒకసారి

వాళ్ళయింటికి రమ్మని. నేను వెళ్లా. ఆమె ఇల్లా అంది. "అన్నయ్యా! అంజయ్యగారికీ నీకు స్నేహంకదా. మా చక్రం అంజయ్యగారి కూతురును పెళ్ళి చేసుకుంటా నంటున్నాడు. నన్ను వప్పుకోమని రోజూ 'మారాం' చేస్తున్నాడు. మా చక్రానికి మేనమామకూతురు బి.యే. ప్యాసయి సిద్ధంగాఉంది. నేను ఆ పిల్లను మా చక్రానికి చేసుకోకపోతే మా అన్నయ్య ఉసూరు మంటాడు. మురళి పెద్దవాడుకదా అతనికే ఆ రాధనిస్తే బాగుంటుం దేమో. మురళికికూడా ఆ అమ్మాయిని చేసుకోవాలని అభిప్రాయం ఉందని మా చక్రమే చెప్పాడు. మురళిని కదిలిస్తే నిజమేనని ఒప్పుకున్నాడు. కట్నంసంగతి అంటారా, పోనీ వాళ్ళిస్తే ఎంత, ఇవ్వకపోతే ఎంత? మనమేమీ వాళ్ళ కట్నంమీద బ్రతుకక్కరలేదు కదా!

ఆ పిల్లను ఒకమాటు పేరంటంలో చూచాను. గుమ్మడిగింజల్లే పిల్ల బాగానే ఉంటుంది. "చెంపకు చేర డేసి కళ్లు, లక్ష్మి కళకళలాడే ముఖం."

ఈ మాటలు విని నేను "అమ్మా! ఊరు ఉమ్మడి వ్యవహారాల్లో వీరిద్దరికీ పచ్చగడ్డివేస్తే భగ్గుమంటుంది కదా! ఒకరిది 'హనుమంతపక్షం', ఒకరిది 'వీరభద్ర పక్షం'గా ఉంది. అంజయ్యన్నను ఎల్లాగయినా బ్రతి మాలుకుంటాను కాని భద్రయ్య ఒప్పుకుంటాడా" అని అన్నా. "ఆ పూచీ నాది" అని చెప్పిందంజయ్యన్నా, నీ వియ్యపురాలు.

అంజ : దేనికయినా దైవఘటన ఉండాలి.

సారథి : దైవఘటన లేనిది సారథికి మనస్సులో సంకల్పమే కలుగదనుకో.

(మురళి ప్రవేశిస్తాడు "అంజయ్యగారూ" అంటూ.)

అంజ : రా! మురళీ, కూర్చో.

సారథి : అయితే, మురళీ! మీనాన్న చాలా డబ్బు ఖర్చు పెట్టేస్తున్నాడటగా ఎన్నికలకు. ఎంత పలచన! ఎంత పలచన! ప్రజలకు రేపటినుంచీ.

మురళి : నేను ఆయనను బ్రతిమాలాను మానుకోమని. "తాడూ, బొంగరం, లేని సత్యం ఉండగా లేనిది నేను ఉండడానికేం నూరుపుట్లు పండించేవాడిని" అన్నాడు. "గౌరవం అనేది కేవలం డబ్బువల్ల మాత్రమే రాదు. మీరు ఎన్నికలలో డబ్బు ఖర్చుపెడితే ప్రజలను పాడు చేసినట్లవుతుంది" అని చెప్పాను. అయితే నన్ను కబురంపారుట దేనికి?

అంజ : ఏమీలేదు మురళి. మనం అందరమూ గ్రామ శ్రేయస్సు కోరేవాళ్లం. ఈ విధానంవల్ల గ్రామప్రతిష్ఠ దెబ్బతిని మనుష్యులకు నైతికంగా విలువ పోతుంది. "మా జీవితాలను స్వాతంత్ర్యసమరంలో అంకితం చేసింది మనుష్యుల నిర్ణయాధికారాన్ని చీకటి బజారులో కొనుక్కునే రాజ్యం కోసమేనా" అని అనిపిస్తోంది ఇప్పుడు మురళీ!

మురళి : నిజమే. నావల్ల ఏమవుతుంది?

అంజ : అల్లా ప్రతివాళ్లూ అనుకుంటే జాతి నిర్వీర్యమై పోతుంది. మహాపురుషుడు ఎప్పుడూ ఒక్కడే ఉంటాడు. ఆతని నైతికమైన శక్తి సంఘంమీద తెలియకుండా పని చేస్తుంది. ప్రతి ఒక్క గ్రామంలో ప్రతి ఒక్కరూ సురాజ్యం కావాలని ధృఢసంకల్పం చేస్తే భారత దేశంలో ఆనాడే రామరాజ్యం ప్రతిష్ఠాపితం అవుతుంది.

సారధి : మురళీ! ఇంతవఱకూ సత్యంపైనే జనం మొగ్గు ఉంది. రేపు ఏమవుతుందో ఎవరికీ తెలియదు. మీఇంట్లో సొమ్ము గండిపడిపోతోంది. దానికి కాళ్లు వచ్చేసినై భద్రయ్యకు ఆవేశం రావడంతో. ఒక ఆసుపత్రి కట్టించి నట్లు కాదు, ఒక చెఱువు త్రవ్వించినట్లు కాదు, ఒక సంస్కృతపాఠశాల పెట్టినట్లు కాదు. మీ ఇంట్లో సొమ్ము ఊరికే పోతోంది. మీ యింట్లో సొమ్ముపోకుండా గ్రామానికి నీవు చేయదగిన పని ఉంది.

మురళి : అల్లాంటి వీలుంటే చేయడానికేం?

సార్థి : నువ్వే ప్రెశిడెంటుగా నిలబడతానంటే, సత్యం మానుకుంటాడు, మీ తండ్రీ మానుకుంటాడు. అసలు ఎన్నికే ఉండదు. అందరూ ఆమోదిస్తారు. అంజయ్య గారికికూడా రాధను నీ కిచ్చి నిన్నొక ఇంటివాణ్ణి చేయా లని ఉంది. ఇద్దఱూ తల్లిలేని పిల్లలే. ఇద్దరూ గ్రామ క్షేమం కోరుతూ భారతమాతపాదాలకు మీ జీవితాలను అంకితం చేయవచ్చు. మనగ్రామం నవచైతన్యంతో తొణికిసలాడుతుంది.

(సత్యం ప్రవేశం)

సారథి : సత్యం! నీవు నవనాయకత్వం కావాలన్నావు. మురళిని మన పంచాయతీ అధ్యక్షుడుగా ఉండమని కోరుతున్నాం. ఏకగ్రీవంగా ఎన్నికయిన పంచాయతీలకు ఎక్కువ సౌకర్యాలు కలుగుతై.

సత్యం : నేను ప్రపోజు చేస్తా. ఇతను రాదగినవాడు.

మురళి : మా నాన్న ఎల్లాగూ నిలబడతానని ప్రచారం చేసేశాడు. నేను నుంచుంటానంటే కుటుంబ కలహం వస్తుందని భావిస్తున్నాను. మా చక్రం కూడా ఊళ్లో లేదు.

సార : ఏమీరాదు. మీ అమ్మతో చెప్పి తగాదా రాకుండా చేస్తా.

సత్యం : రా! మురళీ! ఓటర్లందరితో నేను నిలబడడం లేదనీ నీవు నిలబడుతున్నావనీ చెప్పేస్తా నీ యెదుటనే.

(సత్యం, మురళి, వెళ్లిపోతారు)

అంజ : మొత్తంమీద సారథీ! నువ్వు అసాధ్యుడివే.

సారథి : ఉపాయం లేనివాణ్ణి ఊళ్ళోనుంచి వెళ్ళకొట్టమన్నారు. మనంకూడా వెళ్లిపోదాం పద.

(అంజయ్య, సారథి వెళ్లిపోతారు. రాధ ప్రవేశిస్తుంది)

రాధ : ఊదరా ఒకసారి మురళి
చెలువుడా
ఊదరా ఒకసారి మురళి

(రామం ప్రవేశిస్తాడు)

రామం : అక్కయ్యా, అక్కయ్యా, భద్రయ్యగారు మురళి గారు నిలబడతారన్న దగ్గఱనుంచి డబ్బు ఖర్చు పెట్టడం మానివేశారేవ్.

రాధ : "భద్రయ్యగారు" అని ఎప్పటినుంచి మన్నించడం నేర్చుకున్నావురా.

రామం : నీకు మామగారు అవుతారని తెలుసుకున్న దగ్గఱ నుంచీ – (ఆగి) నే నొక రహస్యం చెప్పనా "సత్యం మీద అయితే నిలబడతానన్నా కాని, రాగా పోగా మా 'జోగులు' మీదా! అన్నాట్ట భద్రయ్యగారు. ఎల్లాగూ మురళిగారే ప్రెశిడెంటు అవుతారు. అక్కా! మనరోడ్డు సిమెంటుతో ముందు పడేట్టు చూడు. –

రాధ : ఏమో! ఇంకా ఎవరైనా పోటీగా 'నామినేషన్' పడ వేస్తారేమో!

రామం : కాదే అక్కా! ఏకగ్రీవం, ఏకగ్రీవం – అయినా ఊరుచుట్టూ ఒకసారి 'బలాదూరు' తిరిగొస్తే, ఏయే గ్రహాలు ఏయే స్థానంలో ఉన్నయ్యో తెలుస్తుంది.

(బయలుదేరి గంతులువేస్తూ వెడతాడు)

రాధ : - ఊదరా ఒకసారి మురళి
చెలువుడా
ఊదరా ఒకసారి మురళి

(మురళి ప్రవేశం)

మురళి : ఇంకా కాసేపు ఆగితే ఊదటం అయిపోతుంది. మా నాన్నగారయితే పోటీ మానుకున్నారు కాని, ఆ సమయానికి ఎవరయినా పడయ్యవచ్చు నామినేషన్ !

రాధ : నా ఓటుకోసం వస్తావనుకున్నానే – పోటీ ఉంటే

మురళి : ఇప్పుడు వెయ్యి నీ ఓటు (చేయి చాపుతాడు) (రాధ చేతిలో చేయివేస్తుంది. మురళి ముందుకు లాడుతాడు.)

రాధ : ప్రెశిడెంటు కావలసిన వ్యక్తి తొలిగా చేసే పని యిదా ? ఇంట్లో ఎవ్వరూలేనప్పుడు రావడం; పెళ్లికాని పిల్ల చేయి లాగడం.

(మురళి వదలివేస్తాడు)

మురళి (గడియారం చూచుకుని) టైమయింది. పంచాయతీ ఆఫీసుకు వెళ్లాలి. (వెళ్లిపోతాడు)

రాధ : "ఊదరా ఒకసారి మురళి
చెలువుడా
ఊదరా ఒకసారి మురళి."

(అని పాడుకుంటూ ఉంటుంది)

(తెరలో జై స్వతంత్ర భారత్‌కు జై. అనే నినాదాలు విని పాట ఆపివేస్తుంది. నొసట కుంకుమతిలకంతో మురళి, అతనితో అంజయ్య, సారధి, సత్యం, రామం, చక్రం ప్రవేశిస్తారు.)

అంజ : అమ్మా! రాధా! మన 'మురళిపార్టీ' ఏకగ్రీవంగా ఎన్నికయింది. మన పంచాయితీకి మంచి భవిష్యత్తు ఉన్నదమ్మా.

రాధ : చక్రం ఎప్పుడొచ్చాడు?

చక్రం : 'మీ యింటికొస్తే నువ్వు పలకరిస్తావా లేదా' అని చూస్తున్నా.

మురళి : నేను టెలిగ్రాం ఇచ్చి పిలిపించాను.

సారథి : చక్రానికి వాళ్ల మేనమామకూతురు సంబంధం 'సెటి'లయింది బుల్లెమ్మా! ముందు అన్న పెళ్లి కావాలని పెద్దలు చెప్పారు. అందుచేత మురళి పెళ్లికాగానే తానూ చేసుకుంటాడు.

రాధ : చక్రానికి తగినదే - బి. య్యే. ప్యాసయిన పిల్ల, పట్నంపిల్ల.

మురళి : (నవ్వుతూ) నాలాంటి నాటువాళ్లకు నాటువాళ్ళే దొరుకుతారు.

రాధ : (నవ్వుతుంది)

రామం : తర్వాత ఎప్పుడు పెళ్లయినా, మా రాధా, మురళీగారు ఒకచోట నుంచుంటే ...

సారథి : ఫస్టుగా ఉంటుంది.

(రాధను, మురళిని, సరసను నిలబెడతాడు రామం)

అంజ : రాధ, మురళి, ఒక యింటివాళ్లవుతున్నారు. ఇల్లే గ్రామానికి పునాది. గ్రామమే దేశానికి పునాది. మీ

జీవితాన్ని నవభారత నిర్మాణానికి అంకితం చేయండని ఆశీర్వాదిస్తున్నాను.

రామం : (పాడడం ప్రారంభిస్తాడు. అందరూ అందుకుని కలిసి పాడతారు)

నవభారత నిర్మాణంలో
ఎవ రెవరిది ఎంతటి పాలో
ప్రతి పౌరుడు యోచించాలీ
ప్రతి గ్రామం ఘోషించాలీ.

తమ జీవితమే అంకితమై
తమ చేసిన త్యాగం ఫలమై
మనపెద్దలు తెచ్చిన రాజ్యం
మన కందరికీ అనుభోజ్యం.

జనసందోహం మన వెనుకై
మన మందరమూ ముందడుగై
నవజీవనమే తోణికిస్తాం
నవభారతమే సృష్టిస్తాం.

గణతంత్రపు రాజ్యంలో - ప
జనపక్షం పరిపాలిస్తే
మనకేమీ మన దొకపక్షం
జన సౌకర్యమ్మే లక్ష్యం!

నవభారత నిర్మాణంలో
ఎవరెవరిది ఎంతటి పాలో
ప్రతి పౌరుడు యోచించాలీ
ప్రతి గ్రామం ఘోషించాలీ.

"జై. స్వతంత్ర భారత్‌కు జై"

(తెర పడును)



# శ్రీ సుబ్బరామ శాస్త్రి

| కృతులు : | కృతిపోషకులు |
|---|---|
| జాతీయభారతి : | ఉపరాష్ట్రపతి, రాజ్యసభాధ్యక్షులు<br>శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణయ్య |
| దివ్వటీలు : | లోక్ సభాధ్యక్షులు<br>శ్రీమాన్ మాడభూషి అనంతశయనం అయ్యంగార్ |
| జయభారతి : | ఆంధ్రప్రదేశ శాసనసభాపతులు<br>శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు |
| విజయభారతి : | ఆంధ్రప్రదేశ ముఖ్యమంత్రులు<br>శ్రీ నీలం సంజీవరెడ్డి |
| మధురభారతి : | ఆంధ్రప్రభుత్వ పూర్వామాత్యులు<br>శ్రీ తెన్నేటి విశ్వనాథం |
| మధుర సంక్రాంతి : | విజయవాడ పురపాలక సంఘాధ్యక్షులు<br>శ్రీ జంధ్యాల దక్షిణామూర్తి |

# శ్రీ సుబ్బరామశాస్త్రి కావ్యావళి

| | | | |
|---|---|---|---|
| 1 | జాతీయభారతి | (గేయములు) | రు 2-50 |
| 2 | జయభారతి | ,, | 0-50 |
| 3 | విజయభారతి | ,, | 2-00 |
| 4 | వీరభారతి | ,, | |
| 5 | విక్రమభారతి | ,, | |
| 6 | వందేమాతరం | ,, | |
| 7 | బాలభారతి | ,, | 0-60 |
| 8 | బాలవాణి | ,, | |
| 9 | వఱద కృష్ణమ్మ | ,, | 0-50 |
| 10 | ఉదయభారతి | ,, | |
| 11 | జాజి పాటలు | ,, | |
| 12 | వివిధ భారతి | ,, | |
| 13 | నృత్య భారతి | ,, | 1-00 |
| 14 | మధుర భారతి | ,, | 2-00 |
| 15 | మధుర సంక్రాంతి | ,, | 1-25 |
| 16 | ఆంధ్ర భారతి | (పద్యములు) | 1-25 |
| 17 | అభిషేకము | ,, | 0-75 |
| 18 | దివ్వటీలు | ,, | 1-00 |
| 19 | శతపత్రము | ,, | |
| 20 | నీలవేణి | (కథలు) | |
| 21 | గోవత్సం : శ్రీవత్సం | ,, | |
| 22 | ఉషాసుందరి | (నాటకము) | 1-50 |
| 23 | అంకితం | ,, | 1-50 |
| 24 | వాసంతి | (నవల) | |
| 25 | కూచిపూడి భరతం | (వ్యాసములు) | |